# దర్శనాలు - నిదర్శనాలు

## 2వ భాగం





రచన

డా॥ పోపిదేవి కృష్ణస్వామి

ఎం.ఎ.పిహెచ్.డి.

ప్రచురణ

ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్

ఎడ్యుకేషన్ ట్రస్ట్

ప్రథమ ముద్రణ
మేకాల్ గురుపూజలు — 1991
విజయవాడ



వెల : 16-00



ప్రతులకు :
ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్
ఎడ్యుకేషన్ ట్రస్ట్
23-10-7
పురుషోత్తంవీధి
సత్యనారాయణపురం
విజయవాడ-11



ముద్రణ :
గాయత్రీ ప్రింటర్స్
మారుతీనగరం, ఫోన్ : 74525
విజయవాడ-520 004.

ముఖచిత్ర రూపకల్పన : బాలి

# ఇందులో

# ఇదెందుకు చదవాలి

డా॥ మోపిదేవి కృష్ణస్వామి గారితో నా పరిచయం డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారి ద్వారా. నా కెందుకో వారిద్దరి సాన్నిహిత్యం, సంబంధం చూస్తే డాక్టర్ జాన్సన్, బాస్వెల్‌లు గుర్తుకొచ్చారు. ఆంగ్ల సాహిత్యంలోనేకాక, ప్రపంచ సాహిత్యంలో ఎక్కడా కూడా బాస్వెల్ రచించిన 'బయోగ్రఫీ' వంటిది మనకు కనబడదని చాలామంది అభిప్రాయం. బాస్వెల్లే లేకపోతే జాన్సన్ గొప్పతనం ప్రపంచానికి అంతబాగా తెలిసి ఉండేది కాదేమో! బాస్వెల్‌కి జాన్సన్ అంటే అంతటి 'హీరో వర్షిప్' లేకపోతే, అంత గొప్ప గ్రంధాన్ని రచించగలిగి ఉండే వాడు కాదన్నది కూడా సత్యమే. అందుకే అంటారు. ఏ వ్యక్తి లోనైనా ప్రతిభ ఉండడం ఒక ఎత్తు. ఆ ప్రతిభని అందరికీ తెలియపరచగలిగే బాస్వెల్ లాంటి మిత్రుడు దొరకడం మరొక ఎత్తు. అది ఎంతో అదృష్టంతో కూడిన విషయం. విశ్వనాథ వారు కొంచెం గడుసుగా తనలాటి శిష్యుడు దొరకడం చెళ్ళపిళ్ళ వారి అదృష్టమన్నారు, గురువుగారిగొప్పదనం శిష్యుడిద్వారా ప్రపంచానికి వెల్లడైనందుకు.

కృష్ణమాచార్య, కృష్ణస్వాములు లోకోత్తరమైన గురు శిష్యులు. మరొక విధంగా చూస్తే వారు ప్రియ మిత్రులు. ఒకరియందు ఒకరికి ఎంతటి ప్రేమానురాగాలున్నాయో, వారి ద్దరితో పరిచయమున్నవారికందరికీ బాగా తెలిసిన విషయమే. కృష్ణమాచార్యులుగారి నోటినుండి ఏ మాట వచ్చినా కృష్ణస్వామి

గారికి అది ముత్యం, ఆ ముత్యాలు తనే దాచుకొందామనే స్వార్థ పరుడుకాదు ఆయన. వాటిని అందరికీ పంచిపెట్టాలి. అప్పుడు అందరూ పొందే ఆనందంలో తనూ పాలుపంచుకోవాలి. కృష్ణ స్వామిగారి 'దర్శనాలు - నిదర్శనాలు' వెనక ఈ మనస్తత్వమే బాగా గోచరిస్తుంది. వారు ప్రచురించదలచుకున్న రెండవ భాగానికి పరిచయ వాక్యాలు వ్రాయమని నన్నడిగినప్పుడు వాటిని చదవటం జరిగింది. ముఖ్యంగా రెండవభాగం మొదటి నుంచి చివరివరకు పుస్తకం క్రిందపెట్టకుండా ఏకబిగిన నా చేత చదివింప జేసింది. చదువుతున్నంత సేపూ నా చిరకాల మిత్రులు, పూజ్యులు కృష్ణమాచారిగారు మాట్లాడుతూ ఉంటే వింటున్నట్లుగానే నా కనిపించింది. చదువుతుంటే ఎక్కడా విసు గనిపించకుండా, మనల్ని, పుస్తకం ముందుకు తీసుకెళుతుంది. అది మంచి పుస్తకాలకుండవలసిన లక్షణాలలో మొదటిదని నా అభిప్రాయం.

వీటిలో, జీవితాన్ని ఎంతో మథించి తీసిన విజ్ఞానం ఉంది, ఎవరితో ఎలా ఉండాలో, ఎప్పుడు ఏం చెయ్యాలో, ఎక్కడ ఎటువంటి విధంగా ప్రవర్తించాలో తెలుసు కోవాలంటే ఈ పుస్తకం తప్పక చదవండి. అంతటితో తృప్తి చెంది ఊరుకోక, మీరెవరి బాగోగులు కోరుతారో వారందరి చేతా చదివించండి. అలా చేస్తే కృష్ణస్వామి శ్రమ వృధా కాదు. అప్పుడు మీరుకూడా కృష్ణస్వామిగారి వంటి నిస్వార్థ పరుల కోవలోనికి చేరుతారు.

శుభం

2-5-1990

విజయవాడ

అందవిల్లి సత్యనారాయణ

# సూటిగా - స్పష్టంగా...

మనకు తెలిసిన అంశాలను ఉదాహరణలుగా చూపిస్తూ, మనకు తెలియవలసిన సూక్ష్మాలను మన హృదయాలకు హత్తుకునే లాగున వివరించి చెప్పడమనేది అనాదిగా మహాత్ములందరిలో మనకు సహజంగానే గోచరించే ఒకకళ. మళ్ళీ ఈ కళను వినియోగించడంలో వారిలో ఎవరి ప్రత్యేకత వారిదే.

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య ప్రవచనాలలో ప్రబోధ ఉపదేశాలు జమిలిగా సాగిపోతుండేవి. ప్రబోధం మళ్ళీ రెండు విధాలుగా సాగేది. వ్యక్తిగతంగా, సమాజపరంగా ఉపదేశమూ రెండు విధాలుగా సాగేది. సంస్కరణపరంగా, సాధనాముఖంగా. ఇలా ప్రయోజనకరంగా సాగే ఆ ప్రవచనాలు వ్యక్తి తానుగా మేల్కొని, తనలో మేల్కొంటున్న సమాజంతో శ్రుతిని కలిపి, తనను తాను సంస్కరించుకుంటూ, సమాజపరంగా రావలసిన సంస్కరణకు దోహదం చేస్తూ, మానవ జీవిత నిర్వహణకు అత్యంత ఆవశ్యకమైన యోగసాధనలో చకాచకా ముందుకు సాగిపోయేటట్లుగా చేసేవి, యోగసాధనకు పరమావధియైన యోగజీవితాన్ని అతనికి సిద్ధంపచేసేవి. ఆ మహనీయుని ప్రవచనాలు అంతటివి. ఆయన ఒక జ్ఞాన భాస్కరుడై నిలచి, జ్ఞానాన్ని కిరణాలుగా ప్రసరింపజేస్తూ, అజ్ఞానాంధకారాన్ని కరిగిస్తున్నారన్న అనుభూతి కలిగేది.

ఆ ప్రవచనాలు మనిషి జీవితాన్ని ఎన్ని వైపుల తడమాలో అన్ని వైపులా తడిమి సరిచేస్తూ ఉండేవి. అలా తడిమి సరి చేస్తున్న వేళలలో ఆయన నుండి చక్కని 'దర్శనాలూ-నిదర్శనాలు' ఈవలకు సాగివచ్చేవి. ఆ ఉదాహరణలు ఇక అలా గుర్తుండిపోయేవి. ఆ ఉదాహరణల ద్వారా జరిగిన ఉపదేశాంశాలు అలా హృదయానికి హత్తుకొనిపోయేవి. మాష్టరు గారే వివిధ ఉదాహరణలుగా రూపుధరించి, రావలసిన మార్పు రు మనలో వచ్చేలా చేస్తున్నారనిపించేది.

దివ్యశక్తి సమన్వితాలైన ఆ ఉదాహరణలను ఉపదేశాలను 'దర్శనాలు - నిదర్శనాలు' గా గ్రంథ రూపంలో అందిస్తూ రావడమన్నది అలనాడు వారి ఆశీస్సులతోనే ఆరంభమైంది. రెండవ భాగం రూపుదిద్దుకొని ఇప్పుడు మీకు చేరువవుతూ ఉన్నది.

'దర్శనాలు - నిదర్శనాలు' మొదటి భాగంలో భగవద్గీత-పతంజలి యోగసూత్రాలలో ఉపదేశింపబడిన రాజయోగ సాధనా మార్గాన్ని అనుష్ఠించడం ఎలా అన్నది లలితమధురంగా తెలియజెప్పబడింది. ఇప్పుడీ రెండవ భాగంలో ఆ యోగసాధన స్వరూపాన్ని, నిత్య జీవితంతో ఎలా అనుసంధించుకోవాలి అన్నది సుందర గంభీరంగా వివరించబడింది. అలాగే సహ జీవనం ఎలా సాగాలీ అన్నది మొదటి భాగంలో సూచింపబడితే, నేటిసమాజంలో ఎలాంటి సంస్కరణ జరగాలన్నది ఈ రెండవ భాగంలో బోధించబడింది. ఈ రెండు భాగాలూ అనుష్ఠాన గ్రంథాలు. నిత్య జీవితాన్ని ఏవిధంగా మలచుకుంటే మనలో యోగసాధన జరిగి మనకు యోగ జీవితం సిద్ధిస్తుందో, ఆ విధా నాన్ని ఈ గ్రంథాలు మనకు కరతలామలకం చేస్తున్నాయి.

పండితుల వాక్కులో క్లిష్టత ఉంటుంది. అది వారి పాండిత్య వైభవాన్ని ప్రదర్శిస్తుంది. ప్రవక్తల వాక్కులో స్పష్టత ఉంటుంది. అది వారి పరమ ప్రేమ స్వరూపాన్ని అనుభవానికి తెస్తుంది. అలాంటి స్పష్టతనూ, అలాంటి అనుభూతిని ఈ దర్శనాలూ - నిదర్శనాలూ ఒకటి రెండు భాగాలలో మనం నిండుగా అనుభవించగలుగుతాం.

ఈ దర్శనాలూ - నిదర్శనాలను చదువుతూ ఉంటే, సాధన మార్గం ఇంత సూటిగా అందుతున్నదే ఇక్కడ! అని మనస్సు సంబరపడుతుంది. సత్యాన్ని ఇంత సరళంగా చెప్పడం ఎలా సాధ్యమైంది! అని మన మనస్సు ముచ్చటపడిపోతుంది. సమన్వయాన్ని ఇంత హాయిగా అందించడానికి ఎలా వీలు కలిగింది ! అని మన మనస్సు మరల మరల మురిసిపోతుంది. అలా సంబరంతో ముచ్చట పడుతూ ఉండగా, సంతోషంతో మురిసిపోతూ ఉండగా మన ప్రజ్ఞ ఆయా కక్ష్యలలోనికి అలా అలవోకగా ప్రవేశిస్తూ, తన నిజస్థితి పొందుతూ ఉండగా. గ్రంథపఠనం పూర్తయిపోతుంది. మనకు తెలియకుండానే! కాని గ్రంథమిచ్చిన ఆ ఎదుగుదల ఆ అనుభూతి మాత్రం మనతో నిలిచి పోతాయి మనమున్నంత వరకూ! అంటే శాశ్వతంగా!

గీతాబోధ పూర్తయ్యేటప్పటికి అర్జునుడు యోగియై నిలబడినట్లుగా గ్రంథపఠనం పూర్తయ్యేటప్పటికి చదువరి సాధకుడై యోగస్థితిలో కుదురుకుంటాడు. ఈ దర్శనాలూ, నిదర్శనాలకు తానొక నిదర్శనమై నిలుస్తాడు.

అలాంటి 'దర్శనాలూ - నిదర్శనాలు' రెండవ భాగం రూపుదిద్దుకున్న ఈ శుభవేళ అందరకూ నా శుభాకాంక్షలు. తమ ముందుమాట చదువరులకు స్వాగతం పలుకుతున్న శ్రీ అండవిల్లి గారికి నా కృతజ్ఞతలు. మీ అక్షర రూపానికి తగిన 'అచ్చు' రూపాన్ని తీసుకుని రావడంలో మా అనుభవాన్నంతటినీ శ్రద్ధగా వినియోగిస్తామని సార్ధకంగాపలికిన 'గాయత్రీ ప్రింటర్స్' సోదర బృందానికీ, ముఖచిత్రాన్ని తీర్చి - దిద్దిన 'బాలి' కీ నా అభినందనలు. ఈ గ్రంథాలు ఇలా మీ చేతులకు అందించడానికిగాను ఎందరో కార్యకర్తలు ఎన్నో విధాలుగా కృషిచేస్తూ వస్తున్నారు. వారందరికీ నా ఆశీస్సులు.

27-12-90

విజయవాడ

వేపిదేవి కృష్ణస్వామి

## ప్రశ్న - సమాధానము

నాలాగ దారిదొరక్క జీవిత ప్రయాణంలో తికమక పడి పోతున్న వారెందరో ఉన్నారు. మరి వారందరూ మీ దగ్గరకు ఎప్పటికి చేరుకుంటారు ? ఎలా చేరుకుంటారు ? అన్నది ప్రశ్న. 'నీలాగానే చేరుకుంటారు వారికి కాలం కలిసివచ్చినపుడు' అన్నది సమాధానం.

ఆశలతో, ఆవేశాలతో, ఈర్ష్యాసూయలతో, రాగద్వేషాలతో కనబడుతున్న, కలబడుతున్న మనుషులందరూ క్షోభిల్లిపోతు న్నారు కదా ! మరి వీరికి శాంతి ఎప్పటికి లభిస్తుంది ? ఎలా లభిస్తుంది ? — అన్నది ప్రశ్న. నీలాగే వారూ శాంతిని పొందుతారు. ఆ పొందడానికి వారి సమయం వారికీ రానున్నది.' అన్నది సమాధానం.

'అయితే వారికోసం నేను చేయ గలిగింది ఏమీలేదా?' అన్నది ప్రశ్న. హద్దులు మీరిన ఆవేశంలో ఉన్నప్పుడు నీవు చేయగలిగింది ఆవేశపడటం మాత్రమే' - అన్నది సమాధానం. మరయితే నేను చేయువలసింది ఏమిటి?' అన్నది ప్రశ్న. మొదటగా నీవు చేయువలసింది ఆవేశాన్ని వశంలోనికి తెచ్చు కోవడం, అటుపైన ఎవరినిగురించి నీవు బాధపడుతున్నావో, వారిని చిన్నచూపు చూడకుండా ఉండగలగడం.

'ఆఁ. నేను చిన్నచూపు చూస్తున్నానా?'- అన్నది ప్రశ్న.

'అవును. నీవేదో బాగుపడిపోయినట్లు,వారేమో ఇంకా బాగు పడనట్లూ నీ కనుపిస్తోంది కదా! పామరులుగా, అజ్ఞానులుగా,

పతనమైపోయినవారుగా వారు నీకు కనిపిస్తున్నారుకదా! మరి అదంతా వారిని చిన్నచూపు చూడటం కాదా? దీనిని విశ్వప్రేమ అని అనుకోమంటావా?'- అన్నది సమాధానం.

మరయితే నన్నేం చేయమంటారు?' - అన్నది ప్రశ్న. మొదట, వారినిచిన్నచూపుచూడటం మానేయ్. ఒకప్పుడు నీవూ అలాఉండి ఉన్నవాడివేనన్న అంశం గుర్తు తెచ్చుకో. చిన్న చూపుచూస్తూ ఆవేశపడిననాడు నీవు అహంకారివి కాగలవేమో గాని, వారికి సహకారివి మాత్రం కాలేవు. వారిలో ఉన్నదీ దైవమేకనుక వారిని ఆరాధించడం నేర్చుకో. శిలను ఆరాధించి నప్పుడే శిల్పి శిల్పాన్ని రూపొందించ గలడు. తోటివారిలో దైవాన్ని దర్శించగలిగినప్పుడే వారు దైవ మూర్తులుగా నిలబడే టందుకు కావలసిన దోహదాన్ని నీవు అందించగలవు. అప్పుడే నీకా అవకాశం ఈయబడుతుంది.'- అన్నది సమాధానం.

## క్షణం చాలు

దశాబ్దాల తరబడి దుష్టకార్యాలుచేయడానికే అంకితమై పోయి మానసికంగా అంధకారం కరుడుగట్టిన వ్యక్తి ఒక్క సారిగా బాగుపడాలంటే సాధ్యమౌతుందా? అతడునిజంగా బాగు పడాలని తానుగా కోరుకోవాలేగాని తప్పక సాధ్యమౌతుంది. ఇంకా చెప్పాలీ అంటే ఆ క్షణంలోనే సాధ్యమౌతుంది.

చీకటి రోజులలో రాత్రి పన్నెండుగంటల వరకు మన మెక్కడో ఏదోపనిమీద ఉండి, అప్పుడే ఇంటికి వచ్చామనుకోండి.

తలుపు తీశాం. అంతా చీకటి. సాయంత్రం ఆరుగంటలనుండి అప్పటివరకు అక్కడ అలా చీకటి చిక్కబడి ఉంది. ఆ చిక్కబడిన చీకట్లో లైటుకోసం స్విచ్ వేశాం. లైటు వెంటనే వెలిగింది. లైటు వెలిగిన వెంటనే చీకటి కరిగిపోయింది. ఇంకా చెప్పాలంటే ఆ వెలుగుతున్న క్షణంలోనే ఆ చీకటి కరిగిపోయింది. అప్పటికి ఆరుగంటల నుండి నిలచి ఉన్న ముదురు చీకటి కదా! అది, వెలుగుగా రూపొందడానికి కొంతయినా సమయం పట్టదా? అని అనిపించవచ్చు తెలియని వారికి. కాని అలా పట్టడంలేదు. ఆ క్షణంలోనే చీకటి కరిగిపోతున్నది. ఇక్కడ ఈ అంధకారం ఎలాంటిదో, అక్కడ దుష్టజనుడైన ఆ వ్యక్తి మనస్సులోపల కరుడుగట్టిన అంధకారంకూడా అలాంటిదే. అతడు నిజంగా బాగు పడదలచినప్పుడు, బాగుపడాలని అతనికి అనిపించినప్పుడు, బాగు పడటానికి అతనికి కాలం కలసి వచ్చినప్పుడు, అతడు బాగుపడటానికి నిజంగా ఒక్క క్షణం చాలు. లైటు వెలుగుతున్న క్షణాలలోనే చీకటి కరగిపోయినట్లుగా బాగుపడాలని సంకల్పిస్తున్న క్షణాలలోనే అతడు బాగుపడటం జరిగిపోతుంది. అయితే అతడు నిజంగా అనుకోవాలి. గాఢంగా అనుకోవాలి. దృఢంగా అనుకోవాలి. ఒక వాల్మీకిలా, ఒక వేమనలా అనుకోవాలి.

ఈ సత్యాన్ని తెలియ జెపుతూనే గీతలో శ్రీకృష్ణుడు, 'ఎంత దురాచార పరుడైనప్పటికీ, 'నేను' తప్ప అన్యము లేదని ఎరిగినవాడై, ఆ అంతర్యామి స్థితిని గాఢంగా అనుభవించగలిగిన నాడు ఆ క్షణంలోనే అతడు ధర్మాత్ముడౌతున్నాడు. శాశ్వతమైన శాంతికి నోచుకుంటున్నాడు.' అన్నాడు.

## అప్పుడు బాగుంటుంది

'దున్నేవారిదేభూమి' అని అంటున్నారు. అలా అని గోడల మీద వ్రాస్తున్నారు. 'భూమిగలవారందరుదున్నాలి' అనిఅనండి అలాఅనివ్రాయండి. అలా వారినందరినీ కర్మాచరణకు, కర్తవ్య నిర్వహణకు ఉన్ముఖులను చేయండి. అప్పుడు బాగుంటుంది.

'యువకులారా! ఏకం కండి.' అని అంటున్నారు. అలా అని గోడలపైన వ్రాస్తున్నారు. 'మానవులారా! ఏకంకండి' - అని అనండి. అలా అని వ్రాయండి. పిల్లలని, యువకులని, పెద్దలని, వృద్ధులని, మానవులను విడదీస్తే ఎలాగ చెప్పండి? అందులోనూ వృద్ధులను పట్టుకొని 'ముదుసలులారా: చావండి', అన్నాం అనుకోండి. మనం కూడా కొంతకాలానికి వృద్ధుల మవుతాం కదా! ఆ అంశాన్ని కూడా గుర్తించండి. అందుకని అన్నివయసులవారిని ఆదరించండి. అందరినీ సంస్కరించండి. అందరినీ సద్వినియోగం చేయండి. అందరికీ కలసివచ్చేటట్లుగా, 'మానవులారా! ఏకం కండి' అని అనండి. అలా అని వ్రాయండి. అలా అని పిలుపునివ్వండి. అప్పుడు బాగుంటుంది.

'కార్మికులారా! ఏకంకండి. కర్షకులారా! ఏకంకండి! - అని అంటున్నారు. అలా అని గోడలపైన వ్రాస్తున్నారు. వృత్తుల పేరిట మానవజాతిని వేరుచేసి, మళ్ళీ మీరు ఏకంకండీ, మీరు ఏకంకండి.'' అని వేరువేరుగా చెబుతున్నారు. ఈ భూమి పైన వృత్తులన్ని ఒకదానిపైన ఒకటి ఆధారపడినవే. ఒకదాని

కొకటి పరిపోషకాలుగా వర్ధిల్లుతున్నవే. కనుక సకల వృత్తుల వారూ కలసిమెలసి మెలగాలనికోరండి. అందరూ కలసి అందరికీ న్యాయంజరిగేటట్లు మనసామాజికవ్యవస్థకు తగిన రూపు దిద్దండి. ఆ వ్యవస్థలో ఎవరిని ఎవరూ హతమార్చవలసిన అవసరం రాకూడదు. పద్ధతి తప్పుతున్నవారిని, హద్దులలో పెట్టడంలో మాత్రం ప్రేమపూర్వకమైన జాగరూకత ఒకటి నిరంతరం పాటింప బడాలి. అలా జరిగేటట్లు చూడండి. అందుకు పిలుపు నివ్వండి. అప్పుడు బాగుంటుంది.

'స్త్రీలంతా ఏకంకండి.' - అని అంటున్నారు. అలా అని గోడలపైన వ్రాస్తున్నారు. స్త్రీ, పురుషులు వేరువేరుగా ఐక్యతను సాధించుకొని ఏమి చేస్తారో చెప్పండి. మనుషులను అలా స్త్రీ పురుషులుగా విడదీయకండి. స్త్రీ, పురుషవిభాగమన్నది ఈ సృష్టిలో జరుగుతున్న ఒక పవిత్రమైన ఏర్పాటు. అది ఏర్పాటే తప్ప వేర్పాటు కాదు. కారాదు. స్త్రీ, పురుషులు ఒకరిపైన ఒకరు ఆధారపడవలసినవారు. ఒకరికొకరు పరస్పర పరిపోషకులుగా పనిచేయవలసినవారు. ఒకరికొరకు ఒకరు బ్రతుక వలసినవారు. తమ మధ్య పెంపొందే అన్యోన్యతలో అనురాగాన్ని పండించుకుంటూ, ఈ సృష్టికిపరమావధియైన అద్వైత స్థితిని అనుభవించవలసినవారు. ఈ సత్యాలను వారికి తెలియ జెప్పండి. ఈ సూక్ష్మాంశాలను వారికి బోధపరచండి. కలసి బ్రతకడం ఎలాగో వారికి నేర్పండి. ఎక్కువ తక్కువలకు చోటులేని సనాతనమైన దివ్యజీవన విధానములోనికి వారిని మేలుకొలపండి. 'స్త్రీ, పురుషులారా! కలసి మెలగండి. మెలగి వెలగండి!' అని అనండి. అలా అని వ్రాయండి. అప్పుడు బాగుంటుంది.

'హక్కులను సాధించుకోవడానికై తరలిరండ'ని సమాజం లోని వివిధవర్గాల ప్రజలను ఉద్దేశించి మీరు పిలుపునిస్తున్నారు. అలా అని గోడలపైన వ్రాస్తున్నారు. హక్కులనుగురించి అంతగా పట్టించుకుంటున్నవారు బాధ్యతలనుగూర్చి ఏమాత్రము స్మరించడం లేదేమి? ముందు బాధ్యతా నిర్వహణలో శిక్షణ నివ్వండి. బాధ్యతలను పరిపూర్ణంగా నిర్వర్తిస్తున్నవారికే, హక్కులను సమగ్రంగా సాధించుకోవడానికి కావలసిన అర్హత లభిస్తుంది. అని గ్రహించండి. చూడండీ! బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తున్నవారి హక్కులను ఎవరూ అణచిపెట్టలేరు. ఒకవేళ అణచి పెట్టడానికి ప్రయత్నించినా, ఆ ప్రయత్నాన్ని వారు ఎంతో కాలం కొనసాగించలేరు. ఈ సత్యాన్ని గమనించండి. ముందు ప్రజలను శీలవంతులుగా, కర్తవ్యపరాయణులుగా తీర్చిదిద్దండి. సమస్తమైన హక్కులూ వారినప్పుడు అనతికాలంలో వరిస్తాయి. హక్కులపోరాటానికై మీరప్పుడు, ఇంత సమయాన్ని వెచ్చపెట్ట వలసిన పని ఉండదు. ఇలా వెచ్చపెట్టే సమయాన్ని ప్రజలను తీర్చిదిద్దడంలో ఖర్చు పెట్టండి. అప్పుడు వ్యక్తిపరంగాను, జాతి పరంగానూ కూడా చాలామేలు జరుగుతుంది. కనుక 'బాధ్యతలకు అంకితమౌదాం. హక్కులన్నిటినీ అనుభవిద్దాం. అని అనండి. ఇలా అని వ్రాయండి. అలా అని పిలుపునిస్తే అలాంటి ప్రయత్నం ఒకటి జరిగితే మన జాతి బాగుపడటానికి మరెన్నో రోజులు పట్టదని గ్రహించండి. అప్పుడుబాగుంటుంది.

# అప్పుడు చెప్పండి

మనిషి 'ప్రకృతిని జయించాను'- అంటున్నాడు. ఇది నిజమేనా? ఈ అనడాన్నిగూర్చి మనిషి తిరిగి ఆలోచించుకో వాల్సిఉంది.

'కరెంటును కనిపెట్టాను' – అంటున్నాడు. కొన్ని నియమాలనుపాటిస్తే ఆకాశంలో వ్యక్తమవుతున్న విద్యుత్తు మన ఇంటిదాకా వచ్చి, మనకు కావలసిన పనులెన్నింటినో చేసిపెడుతుందని కనుగొన్నాడు. ఈ రోజున ఆ ప్రయోజనాన్ని మరింత విస్తృతంగా పొందుతున్నాడు. అయితే ఇక్కడ గమనించవలసింది ఏమిటంటే, ఆ పాటించవలసిన నియమాల్లో ఏ నియమాన్ని పాటించకపోయినా, విద్యుత్తు వ్యక్తం కావటంలేదు. ప్రవహించటంలేదు. ఆ నియమాలనే మర్యాదలను పాటించినప్పుడే విద్యుత్తు మనదాకా రావడానికి అంగీకరిస్తున్నది. అంటే ఏంతెలుస్తున్నది? మన ఆజ్ఞకు లోబడి అదిలేదు. పని చేయడంలేదు, దాని ధర్మానికి తగినట్లుగా మనం ఒదిగి నడుచుకున్నప్పుడు మాత్రమే అది మనకు అక్కరకు వస్తున్నదని. మరి ఇప్పుడిది జయించినట్లు అవుతుందా? కాదు. దర్శించినట్లు అవుతుంది. ప్రకృతి యెడల శ్రద్ధా భక్తులతో తపస్సుగా తమ పరిశోధనలను కొనసాగించినమీదట, ఆ తపస్సుకు ఫలంగా ప్రకృతి మాత మానవుడికి అందించిన ఒకానొక దర్శనం అవుతుంది. కరెంటయినా అంతే. టెలిఫోన్ అయినా అంతే. రేడియో, టి.వి. లైనా, అంతే. విమానాలూ, రాకెట్లూ అయినా అంతే, మానవుడి తపస్సుకి మెచ్చి, ప్రకృతిమాత అనుగ్రహించిన వివిధ ధర్మ దర్శనాలివి.

ఆయా ధర్మాలకు అనుగుణంగా విధేయతకలిగి నడుచుకున్నప్పుడే మానవుడు ఆయా ప్రయోజనాలను అనుభవించగలిగేది, ఈ సత్యాన్ని మనం గమనించాలి. దర్శనం మనకు లభించిందని మనం గ్రహించినపుడు, విధేయతతో దానిని మనం సద్వినియోగం చేసుకోగలుగుతాం. అలాకాక, ప్రకృతిని మనం జయించేశాం అని మనం అనుకున్నప్పుడు మనలో అవిధేయత పెచ్చరిల్లిపోయి, మనం రాక్షసులుగా తయారవుతాం. జయించాం అని చెప్పుకోవడం గొప్పగా బాగానే ఉంటుంది. కాని అలా చెప్పుకోవడం అలవాటైతే మాత్రం రాక్షసత్వం మనలను ఆవహిస్తుంది. కనుక మనం మాట్లాడేటప్పుడు ఒళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడటం నేర్చుకోవలసి ఉంది.

ఏమిటి మానవుడు జయించింది. ఏమిటి మానవుడు కలిగియున్నది? ఈ ఇల్లు నాది అంటాడు. ఇంటిచుట్టూవాడు తిరుగుతున్నాడా? ఇల్లు వాడిచుట్టూ తిరుగుతోందా? ఇల్లు వాడిదై వాడికి లోబడిఉంటే, వాడి చుట్టూ తిరగాలిగా మరి! నేను యాభై ఎకరాల ఆసామిని! అంటాడు. అనడానికీ, వినడానికీ బాగానే ఉంది గానీ, పొలం దగ్గరికి వీడు వెళుతున్నాడా? పొలం వీడిదగ్గరకి వస్తూ ఉన్నదా? పొలం దగ్గరికి వీడు వెళుతున్నప్పుడు వీడు పొలం వాడవుతాడుగాని. పొలం వీడిదెలా అవుతుంది? ఈ సూక్ష్మాన్ని మానవుడు గమనించాలి. మనదీ, మనసొంతం, మనం జయించాం మొదలైన డైలాగులన్నింటిని వదలిపెట్టి, ప్రకృతిమాత యెడల విధేయత కలిగి ప్రవర్తించడం నేర్చుకోవాలి. అలా విధేయత కలిగి ప్రవర్తించిననాడు మరిన్ని ధర్మదర్శనాలను ప్రకృతిమాత మనకు అనుగ్రహించగలదు.

ఈ సందర్భంగా మరొక సత్యాన్ని కూడా మనం గుర్తించవలసి ఉంది. ఈ కరంటు, టెలిఫోను టి..వి.లు విమానాలూ, రాకెట్లు మొదలైనవన్నీ మనం మాత్రమే మాత్రమే కనుగొన్నాం, మనకు మాత్రమే తెలుసు అనుకోవటం ఒక భ్రమ మాత్రమే. ఈ భూమి మీద ఎన్నో మానవ జాతులు నడచి వెళ్ళి పోయాయి. ప్రతిజాతి తన పరిణామంలో ఇలాంటి వెన్నో కనుగొంటూ, ఉపయోగించు కుంటూనే కాలగర్భంలో కలిసిపోతూ వచ్చింది. మళ్ళీ క్రొత్త జాతికి కథ మామూ లవుతుంది. దాని పరిణామంలో మళ్ళీ ఇవన్నీ వరసగా కను గొనబడుతూ ఉంటాయి. మళ్ళీ అదీ కాలగర్భంలో కలసి పోతుంది. ఇప్పటికి ఇలా ఎన్నిసార్లు జరిగి ఉంటుందో! యువకుడికి మీసం వస్తుంది. అతడు తన పరిణామంలోని భాగంగా దాన్ని గుర్తించాలి గాని, 'భూమి మీద మానవులకు ఇప్పుడే మీసం మొలవడం ప్రారంభమైంది.' అనుకోగూడదు. 'నేనే ఈ మీసాన్ని కనుక్కోగలిగాను. అనుభవించ గలుగుతు న్నాను.' అనుకోకూడదు. ఈ యువకుడి తాతలున్నారే వాళ్ళు ఇతడికన్నా ఎంతో పెద్ద మీసాలు పెంచిన వాళ్ళై ఉంటారు. ఆ మీసాల పైన వాళ్ళు నిమ్మకాయలు కూడా నిలబెట్టి ఉంటారు. కనుక ఈ యువకుడు తన కుర్రకుంక వేషాలతో గెంత కూడదు. ప్రకృతి పరిణామాన్ని గమనించుకోగల వివేకాన్ని తనలో వెలి గించుకో గలిగిన వాడు కావాలి.

చూడండీ! ఇప్పుడు మనల అట్లాంటిక్ మహాసముద్ర మంటున్నామే. అధి ఇప్పుడు సముద్రం. కాని ఒకప్పుడు అది

పైకి తేలిన భూభాగం. ఇప్పుడు మనం నిలబడి ఉన్న ఈ భూమి ఉన్నదే ఇది అప్పుడు సముద్రం. ఆ తేలిన భూభాగం పైన నడచిన నరజాతులలో మనం కనీ, వినీ ఊహించి ఎరుగ నంత విజ్ఞాన వైభవం తేజరిల్లింది. మానవుడు అన్ని విధాలా పరిపూర్ణ స్థితిని అనుభవించాడా అన్నట్లు వెలిగిపోయాడు ఆనాడు. ఆ కథ అయిపోయింది. కాలం దాని గర్భంలోనికి ఆ కథను తీసేసుకుంది. ఇప్పుడొక మహాసముద్రమక్కడ కన బడుతున్నది. ఈ చెప్పబడుతున్న క్షణంలో మీ కేమనిపిస్తు న్నది. ఇది కలా? నిజమా? అనిపిస్తున్నది కదూ! ఇది కలకాని నిజం. అలాంటి మహోన్నతమైన నాగరికతా - సంస్కృతులకు ఆటపట్టైన ఆ ప్రదేశం ఈనాడు జలమయమై సముద్రప్రాంతం గాగోచరిస్తున్నది. సరే! అది అలా జలమయం కాగానే ఇప్పుడు మనమున్న ఈ భూమి పైకి తేలింది. మళ్ళీ ఇక్కడ కథ ప్రారంభమైంది. పరిణామ దశలను దాటుకుంటూ ముందుకు సాగుతున్నది. ఇది ఒక అనంతమైన కథ. దీనికి ఏది ముందు? ఏది వెనుక ? ఏది తుది? ఏది మొదలు? కనుక ఇలాంటి సత్యా లన్నింటిని గమనించుకుంటూ ప్రకృతి పరిణామానికి విధే యులమై ముందుకు సాగడమే మన కర్తవ్యం.

చూడండీ! ప్రకృతిని మనం మాత అంటున్నాం. అంటే మన తల్లి అన్నమాట. తన బిడ్డ ప్రవర్తన నచ్చినప్పుడల్లా తన బిడ్డకు తనను గ్రహించగలిగిన స్థితి కలిగినప్పుడల్లా, తల్లి బిడ్డకు అనేకమైన రహస్యాంశాలను. తన పుట్టుపూర్వోత్తరాలను తెలియ జెబుతూ ఉంటుంది. అది సహజం.ఆ అంశాలను ఆమె ప్రేమకు సంకేతాలుగా, ఆమె అనుగ్రహ వైభవాలుగా స్వీకరించి బిడ్డ

సద్వినియోగం చేసుకోవాలి. అంతే గాని, మరికొన్ని అంశాలు, మా తల్లినిగూర్చి నాకు తెలిశాయి కాబట్టి, ఇక 'మా తల్లిని నేను జయించినట్లే' అని ఆ బిడ్డ అనవచ్చును, అంటే ఎంత ఎబ్బెట్టుగా ఉంటుంది? ఏ బిడ్డయినా తన తల్లిని జయించాలనుకుంటాడా? ప్రేమించాలని కోరుకుంటాడా? తన తల్లి తన చేతిలో ఓడిపోవాలని అనుకుంటాడా? లేక తన తల్లి ఒడిలో తాను ఒదిగి పోవాలని కోరుకుంటాడా? ఆలోచించండి. కొంచెం మనసున్న మనుషులుగా ఆలోచించండి. మమతలెరిగిన మనుషులై ఆలోచించండి. ఆలోచించి అప్పుడు చెప్పండి. ఇంతవరకు మనం మనం సాధించిన అభ్యుదయమున్నదే అది ఆమె ప్రేమా? మన విజయమా?

## ఒక గొడుగు: ఒక సైకిలు

యోగసాధన అనేది మన నిత్య జీవన నిర్వహణలో వ్యక్తం కావాలి. రోడ్డుమీద నడుస్తున్నాము. రోడ్డుకు ఎడమ పైపున నడవాలి అన్న నియమం ఉన్నది కదా! అది ఎవరు చూస్తున్నా ఎవరు చూడకపోయినా అప్రయత్నంగా మన చేత పాటింపబడాలి. రాత్రిపూట సైకిలు తొక్కుతున్నాం. దానికి లైటుండాలి అని మనకే గుర్తుండాలి. రోడ్డుమీద బూట్లు వేసుకుని నడుస్తున్నాం. మరొకరి కాళ్ళు తొక్కకుండా నడవడం అన్నది చేతకావాలి. తొక్కి 'సారీ' చెప్పుకోవలసిన స్థితి రాకూడదు. 'సారీ' చెప్పినా అవతలివాడి బాధ పోదుకదా: అది

మనకు గుర్తుండాలి. అలాగే రోడ్డుమీద గొడుగును పట్టుకొని నడుస్తున్నాం. మరొకరికి ఇబ్బంది కలుగకుండా ఆ గొడుగును పట్టుకోవటం మనకు చేతకావాలి. కొందరు కొందరు గొడుగును ముడిచి అడ్డంగా చంకలో పెట్టుకొని తిప్పుకుంటూ నడుస్తారు. రోడ్డుమీద రద్దీ వేళలో అలా నడుస్తూ ఉంటే, మీ గొడుగు యొక్క ఇనుపకొస వెనుక వాళ్ళ కళ్ళను తోడివేసినా ఆశ్చర్య పడనక్కరలేదు. కనుక గొడుగును మరచిపోకుండా పట్టు కోవడం, ఎంత ముఖ్యమో, ఆ గొడుగును పట్టుకోవడంలో మరొకరికి ఇబ్బంది కలుగకుండా పట్టుకోవడం కూడా అంతే ముఖ్యం. సాయంత్రంపూట నాలుగు వీధులూ కలసిన చోట గుంపులుగా నిలబడి మాట్లాడుతూ ఉంటాం. రోడ్డున్నది నడవ టానికా మనం అలా నిలబడటానికా? అన్న విచక్షణ మనలో పనిచేయాలి. మామూలుగా నిలబడటం చాలక, కొందరు కొందరు తమ వాహనాలతోసహా నిలబడి మాట్లాడుతూ ఉంటారు. ఆ వాహనాలను రోడ్డుకు అడ్డంగా పెట్టి మరీ మాట్లాడుతూ ఉంటారు. మనవల్ల మిగిలినవారికి ఎంత ఇబ్బంది కలుగుతున్నదో అన్న ఆలోచన కూడా రావడంలేదు. అదీ ఆశ్చర్యం. అలాగే ఇంటిలో చెడిపోయిన, పగిలి పాడై పోయిన వస్తువులన్నీ రోడ్డు మీదకు విసిరే వాళ్ళుంటారు. ఆ రోడ్డుమీదే కొంచెం దూరంలో చెత్తకుండీ ఉంటుంది. అక్కడ దాకా తీసుకు వెళ్ళి పడవేసి వచ్చే ఓర్పు మనకు అలవడడం లేదు. అది అలవడాలి. అలాకాక అరటితొక్కలు, గాజుముక్కలు, డబ్బారేకులూ, మొదలైనవన్నీ రోడ్డు మీదకు విసరివేస్తే మళ్ళీ ఆ రోడ్డు మీద మనమూ, మన పిల్లలే నడువవలసి ఉంటుందని

గుర్తుంచుకోవాలి. ఇంటితోపాటు రోడ్డుకూడా మనదేనని, అదికూడా శుభ్రంగా ఉండాలని మనకు గుర్తుండాలి. రోడ్డు మనదికాదు అనిపించటంతో మనం చేయకూడని పనులన్నీ దానిమీదనే చేస్తున్నాం. అలాకాక ఎవరి ఇంటిముందు రోడ్డు వారు చక్కగా ఉంచుకునే ప్రయత్నం చేస్తే ఎంత బాగుంటుంది! మొత్తం వాడవారంతా కలిసి వీధి యెడల శ్రద్ధ వహిస్తే ఎంత బాగుం టుంది! మనకా శ్రద్ధ కలగాలి.

బస్సులో వెళుతూ ఉంటాం. వెళుతున్న మనం మనకున్న సరదాలన్నీ ఆ బస్సులోనే తీర్చుకోవాలనుకుంటాం. సరదాలూ అంటే ధూమపానం మొదలైనవి. ఆ బస్సులో మనతోపాటు ప్రయాణీకులు ఇంకా ఉన్నారని, వాళ్ళు కూడా క్షేమంగా ఉండాలని మనకు గుర్తుండాలి. వారిలో ఈ పొగపడనివారు ఉండవచ్చు. ఆ వాసనకు తలనొప్పి వచ్చేవారు ఉండవచ్చు. వాంతులు చేసికొనేవారు ఉండవచ్చు. మన చేష్టలకు ఫలితంగా అన్ని జరుగుతున్నా, విలాసంగా ఏమీ పట్టనట్లుగాచూస్తూ, ఇంకా ధూమాన్ని గ్రోలుతూనే ఉండేవారు మనలోనే ఉంటు న్నారు. మనసరదా మన అలవాటు అంత మందికి కష్టాన్ని కలిగించ కూడదు, అన్న వివేకం, మనలో ఉదయించాలి.

అలాగే రైల్లో వెళుతూ ఉంటాం. ఏవేవో తింటూ త్రాగుతూ ఉంటాం. ఆ తొక్కలూ, తోళ్ళూ, పెచ్చులు, పీకలు మొదలైన అవశేషాలన్నీ ఆ బోగీలోనే వదలివేసి, 'ఎక్కబోయే ప్రయా ణీకులారా! స్వీకరించండి. ఇవి మా సంస్కారానికి గుర్తులు'- అన్నట్లుగా మనస్టేషన్లో మనం దిగిపోతూ ఉంటాం. ఆ తరు వాత ఆ సీట్లలో కూర్చోవడానికి వచ్చినవారేమైపోవాలి? ఏ

మనుకోవాలి! మనమే కొద్ది శ్రద్ధ చూపించి, వాటినన్నింటినీ ఎప్పటికప్పుడు బయటపడవేసి ఉంటే ఎంత బాగుండేది? 'ఎవర్రా ఇక్కడ కూర్చుని వెళ్ళింది?' అని మరొకరు కష్టపడేటట్లుగా మనం ప్రవర్తించ వచ్చునా?

ఈ చెప్పబడిన వన్నీ చిన్న చిన్న అంశాలుగానే ఉంటాయికాని, మనలో జరుగుతున్న యోగసాధనకు అనుదినమూ ఎదురయ్యే పరీక్షలివి. మనలో సాధన ఏమేరకు జరుగుతున్నదో, వీటిలోని ప్రతి సన్నివేశం పట్టి చూపుతూఉంటుంది. నిత్యజీవిత నిర్వహణను ఇలా నియమబద్ధం చేసుకుంటున్న కొద్దీ మనలో జరుగుతున్న యోగసాధనకు తగిన భూమికను మనం రూపొందించుకోగలిగిన వాళ్ళ మవుతాం.

## ఒక పెన్ను - ఒక లైటు

సామాజిక జీవనంలో నిత్యమూ తటస్థపడే సన్నివేశాలలో సాధకులైనవారు ఎలాంటి శ్రద్ధవహించాలో చెప్పుకున్నాం. గృహస్థ జీవన నిర్వహణలోకూడా నిత్యం ఇలాంటి శ్రద్ధనే మనం చూపగలగాలి. సాధకులైనవారు సాధ్యమైనంత వరకు ఎవరి పనులు వారే చేసుకోవాలి. మనం చేసుకోలేని పనుల విషయం లోను, చేయలేని చేతకాని పనుల విషయంలోను మాత్రం ఇతరుల సహకారాన్ని పొందవచ్చు. అది కూడా కృతజ్ఞతా భావాన్ని కలిగి పొందడం అభ్యాసం చేసుకోవాలి. పనులు

చేసిపెట్టక ఏంచేస్తారులే! అన్నట్లుగా చూడకూడదు, లేక వారు చేయటానికే వున్నారు. అన్నట్లుగా చూడకూడదు. ఈ విషయంలో ఏమరుపాటు ఏ మాత్రమూ పడకుండా ఉండగలగాలి.

యోగసాధకుడికి ఇది చిన్నపని, ఇది పెద్ద పని అని అని పించకూడదు. చేయవలసిన పని ఇది అన్నప్పుడు ఏదైనా ఒక్కటే. ఒకే శ్రద్ధతో చేయాలి. అలాగే ఇదిమనపని ఇది ఇత రులపని అని అనిపించకూడదు. ఆ పని మనదైనా, ఇతరుల దైనా మనచేత చేయబడుతున్నప్పుడు మనదే అవుతుంది. మన కప్పగించ బడినదే అవుతుంది. ఒకే శ్రద్ధతో మనం చేయవలసి ఉంటుంది. ఇది ఎక్కువపనీ, ఇది తక్కువపనీ, ఇది నేను చేయ వచ్చును. ఇది నా స్థాయికి తగదు అని సాధకునికి అనిపించ కూడదు. జరగవలసి ఉన్న పని అక్కడ ఏదైనా అది ఎటువంటి దైనా చేయడానికి మనం సిద్ధంగాఉండాలి. ఒకే శ్రద్ధతో చేయాలి.

ఒక గదిలో పనిని పూర్తిచేసుకుని యివతలకు వస్తున్నప్పుడు ఆ గదిలో వేయబడియున్న ఫ్యాను, లైటు మొదలైనవి తీసి వస్తున్నామా? లేదా? అని చూసుకోవాలి. తీసిరావాలి. పనిచేయటానికి కావలసిన ఉపకరణాలను మనం అనేకంగా స్వీకరిస్తూ ఉంటాం. పని పూర్తికాగానే వాటిని యథా స్థానంలో పెడుతున్నామా? లేదా? సరైన పద్ధతిలో పెడుతున్నామా? లేదా ? అన్న విషయంలో జాగ్రత్తను వహించాలి. అలా జాగ్రత్తను వహించడం వల్ల మళ్ళీ మనకు అవసరమైనప్పుడు అవి సహకరించ గలుగుతాయి. లేకపోతే మళ్ళీ అవసరమైనప్పుడు వాటిని వెతుక్కోవడానికీ, వాటిని దారిలోనికి తెచ్చుకోవటానికి మనకున్న పుణ్యకాలం కాస్తా

ఖర్చయి పోతుంది. మనకు సహకరిస్తున్న వ్యక్తులను గౌరవి స్తున్నట్లే, మనకు సహకరిస్తున్న వివిధ వస్తువులను కూడా గౌరవించడం మనం నేర్చుకోవాలి. పెన్నుతో వ్రాయడం పూర్తి కాగానే పని తొందరలో ప్రక్కన పెట్టేస్తూ ఉంటాం. దానికి క్యాప్ పెట్టామా ? లేదా ? దాని చోటులో దానిని పెట్టామా ? లేదా ? మళ్ళీ కావాలి వ్రాయవలసి వస్తే అందులో సిరా ఉన్నదా ? లేదా ! మొదలైన అంశాలను అలవోకగా గమనించు కుంటూ ఉండాలి. అలాగే బాల్ పెన్నులుంటాయి. దానితో పని పూర్తికాగానే రీఫిల్‌ను పైకి పంపించామో లేదో చూసు కోవాలి. లేకపోతే మనం వేసుకున్న బట్టలు ఖరాబు కాగలవు. ఆ అయిన ఖరాబు మనయొక్క సాధన స్థితిని తెలియజెప్పగలదు. అలాగే ప్యాడ్‌లు, కాగితాలు, పుస్తకాలు మొదలైన వాటి దగ్గర నుండి దువ్వెనలు, బొట్టు పుల్లల వరకు వినియోగించడం పూర్తి కాగానే వాటిని యథాస్థానంలో యథావిధిగా ఉంచడంలో మనం ఏమాత్రం ఏమరుపాటు చెందకుండా ఉండాలి. అయితే ఈ ప్రయత్నంలో మనస్సుకు వత్తిడి కలుగకూడదు. అంతగా మనస్సుకి ఈ జాగ్రత్తలు అభ్యాసం కావాలి. మనస్సుకు అలా తప్ప ఇంకొకలా ప్రవర్తించని స్థితి సిద్ధించాలి.

ఇలా వ్యక్తిగతమైన అంశాల దగ్గరనుండి, కుటుంబ గత మైన అంశాలవరకు, ఆ పైన సమాజపరమైన అంశాల వరకు శ్రద్ధకలిగి పద్ధతిగా ప్రవర్తించడమన్నది మనకు అభ్యాసం కావాలి. ఇలాంటి అభ్యాసం మనలో జరుగుతున్ననాడు క్రమంగా మన జీవితం అర్థవంతమూ, సార్థకమూ కాగలదు. 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' అన్నది భగవద్గీతలో శ్రీకృష్ణుని ఉపదేశం.

నిత్యజీవిత నిర్వహణలో శ్రద్ధను అలవరచుకొన్ననాడు ఆ అలవడిన శ్రద్ధ జీవిత కార్యనిర్వహణలో మనకు అక్కరకు రాగలదు. మన జీవిత కార్యమేదో మనకు స్పష్టముజేసి, ఆ శ్రద్ధయే ఆ కార్యము వెంట మనను నడిపించగలదు.

## ఏమనుకుంటారు - ఏవిా అనుకోరు

'ఈ చొక్కా ఇక్కడ ఈ చేతి దగ్గర కొంచెంగా చిరిగింది.' అన్నాడు, భర్త. కుట్టి సరిచేసి ఇవ్వనా?' అన్నది భార్య. 'అయినా ఇలాంటి చొక్కాను బయటకు వేసుకు వెళితే నలుగురూ ఏమనుకుంటారు? అన్నాడు భర్త. ఆమె ఇక మాట్లాడలేదు. అవును. వేసుకు వెళితే ఏమనుకుంటారు?' 'చొక్కా చిరిగింది' - అనుకుంటారు. అసలైనా ఈ లోకంలో ఉన్న వాళ్ళందరికీ వీడిచొక్కాను చూడటమేనాపని; ఎవడిపని చేసుకోవడానికి వాడికి ఖాళీ దొరక్క సతమతమవుతుంటే! కాని మనస్సుకు అలా అనిపిస్తుంది. 'ఇలాంటి చొక్కావేసుకుని బయటకు ఎలాపెళతాము. వెళితే నలుగురూ ఏమనుకుంటారు?' అని. చిన్న కామన్ సెన్స్ పాయింట్. చొక్కాలనేవి మనకే కాదు. అందరికీ ఉంటాయి. అందరివీ ఎప్పుడో అప్పుడు చిరుగుతూనే ఉంటాయి. సహజమైన ఈ అంశం గురించి మనస్సు ఇంతగా గింజుకు పోతుందేమిటి? అదే చిత్రం.

పెళ్ళికివెళుతూ కూడా ఇలాంటి చీర కట్టుకుంటే నలుగురూ ఏమనుకుంటారు? ఇలా వెళితే నలుగురిలో ఏంబాగుంటుంది?'

అనుకుంటూ తన కిష్టం లేకపోయినా, వీలుగా లేకపోయినా శరీరానికీ, మనస్సుకు హాయిగా లేకపోయినా కావాలని పట్టుబట్టి పట్టుచీరనే చుట్టుకుని వెళ్ళేవాళ్ళుంటారు. ఇంతకీ ఈ చుట్టుకోవడం ఆ చుట్టూ ఉన్న వాళ్ళకోసం. మనకు అవకాశంలేకనో, అనుకూలం కాకనో మామూలు చీర కట్టుకుని వెళ్ళామనుకోండి. అప్పుడేమవుతుందట? పెళ్ళి ఏమైనా ఆగిపోతుందా? అయినా పెళ్ళికొచ్చినవారందరికీ మనచీరలవైపు చూడటమేనా పని? పోనీ ఒకవేళ 'చూశారు' అనుకుందాం. మనం మామూలు చీర కట్టుకున్నట్లు గ్రహించారనుకుందాం. ఆ ప్రక్కనున్న వాళ్ళ చెవులు కొరికారు అనుకుందాం. అందువల్ల మనకొచ్చిన నష్టమేమిటట? మనకున్న దానికీ, అనుకున్న దానికీ తగినట్లుగా మనం ప్రవర్తిస్తాం. ఎవరో ఏదో అనుకుంటారని మన స్థితిగతులకూ, మన ఇష్టాలకూ తగని విధంగా మనం ఎందుకు ప్రవర్తించాలి? ప్రవర్తించవలసిన అవసరం ఏముంది? ఈ విషయమై మీ మనస్సును కొంచెం సూటిగా సంప్రదించండి. ఎందుకని అదలా ప్రవర్తిస్తున్నదో కొంచెం అడిగి చూడండి.

ఇల్లన్న తరువాత బంధుమిత్రులు ఎవరో ఒకరు వస్తూ వెళుతూ ఉంటారు. మనింటికి వచ్చారుకదా! మామూలుగా పెడితే ఏం బాగుంటుంది? అలా పెడితే ఏమనుకుంటారో అని లేని పోని హడావిడి మనస్థాయినిమించి చేస్తున్నామనుకోండి. దాని ఫలితం ఎలా ఉంటుంది? కుటుంబం ఆర్థికంగా దెబ్బతింటుంది. అప్పుడేమంటారు? చూశారా! మేం వాళ్ళకు పెట్టాం. వీళ్ళకు పెట్టాం. ఇప్పుడేమయింది. ఇలా అయిపోయాం. ఇప్పుడెవళ్ళేం చేస్తున్నారు మాకు? అప్పుడయితే తిని వెళ్ళిపోయారుగాని.

అంతేను. ఈ లోకానికి కృతజ్ఞత ఉండదు. అని నోటికి వచ్చి నట్లుగా అనేస్తాం. అనేముందు మనని మనం ఆత్మపరిశీలన చేసుకోవలసిన అవసరం లేదా? వారొచ్చినప్పుడు అన్నం పెట్టొచ్చు. అంతకు మించి హడావిడి ఎందుకు చేయాలి? లేని హోదాలను అభినయిస్తూ అక్కరలేని ఖర్చులు ఎందుకు పెట్టాలి? వారేమయినా అనుకుంటారేమోనని అన్నదేనా మీ సమాధానం. ఏమనుకుంటారు? ఉన్నది పెట్టారు అనుకుంటారు. లేదూ ఇంకో విధంగా అనుకున్నారనుకోండి. మనం వాటిని పట్టించుకోవలసిన అవసరం ఏమిటి? అవసరం లేని వాటిని మనస్సు ఎందుకు పట్టించుకుంటోంది? ఈ అంశాన్ని మీరు కొంచెం పట్టించుకొని చూడండి.

ఇంటికొచ్చిన ప్రతి బంధువుకు బట్టలు పెట్టే అలవాటు ఉన్నవారు ఉంటారు. రాకరాక వస్తారు. బట్టలు పెట్టకపోతే ఏం బాగుంటుంది? పెట్టలేదని అనుకోరా? ఒట్టి జాకెట్టు ముక్క పెడితే ఏంబాగుంటుంది? పెడితే చీర పెట్టాలి. లేకుంటే మానె య్యాలిగాని. నలుగురిలోనూ పరువు నష్టం కాదా? ఇలాంటి మాటలన్నీ అనుకుంటూ లేని చిరునవ్వులు తెచ్చుకుని, అప్పు తెచ్చిన బట్టలతో ఆ చుట్టాలకు బట్టలు పెడుతూ కుటుంబ స్థితిని పాతాళంలోనికి పడదోసుకోవలసిన అవసరమేమిటి? నీకు ఉన్నం తలో పెట్టు. ఉన్నంత వరకే పెట్టు. నీ తృప్తి కోసం పెట్టు. నీ ఆనందంకోసం పెట్టు. అంతే కాని వాళ్ళేమన్నా అనుకుంటారు అనిగాని, వాళ్ళను తృప్తిపరచకపోతే ఎలాగని గాని నలు గురిలో బాగుంటుందా అనిగాని నీకు నీవే ఊహించుకుంటూ లేనిపోని హడావిడి చేయకు. చేసి ఆ పైన ఎదుటివారిని నిందించకు.

ఇంతవరకు ఉదహరింపబడిన ఈ సామాజిక దృశ్యాలన్నీ మనలోని బలహీనతలకు అద్దం పడుతున్నాయి. ఈ దృశ్యాలన్నింటిలోనూ 'ఎవరైనా ఏమైనా అనుకుంటారేమోనని' అనే వాక్యమొకటి బాగా వినబడుతోంది. ఈ వాక్యానికి దడిసిపోయి కుటుంబాలకి కుటుంబాలే కూలిపోతున్నాయి. కూలిపోతూ ఆక్రందిస్తున్నాయి. ఇన్ని చేసిన మేము ఇలా అయిపోతున్నామేమిటని రోదిస్తూ ప్రశ్నిస్తున్నాయి. ఆ ప్రశ్నకు సమాధానం ఏమిటంటే, 'ఇవన్నీ మీరు చేయగలిగి చేయలేదు. చేద్దామనుకొని చేయలేదు. ఎదుటివారు ఏమనుకుంటారోనని చేశారు. అలా చేయటం తప్పు. అందుకు తగిన శిక్షను అనుభవిస్తున్నారు మీరు. ఇప్పటికైనా మీ ప్రకారం మీరు బ్రతకండి. మీ కున్నంతలో మీరు చేయండి. ఆ చేసేదేదో నిండు హృదయంతో, చిత్తశుద్ధితో చేయండి. ఆర్భాటానికని చేసి అ తర్వాత ఆక్రందించకండి. మానసికమైన బలహీనతను మీలో వుంచుకొని అవతలివారిని.' నిందించకండి అని.

చొక్కా చిరిగితే కుట్టుకుని తొడుక్కోవచ్చు. కొంప మునిగింది ఏంలేదు. పట్టుచీరకట్టుకోనంత మాత్రాన అవతల పెళ్ళి ఆగదు. కనుక పట్టుచీరలకోసం మనం పట్టు పట్టనక్కరలేదు. మనకు తగినట్లు మనం ఉండవచ్చు. అతిధులుగా వచ్చిన వారికి ఉన్నంతలో శుచిగా, రుచిగా, హృదయపూర్వకంగా ఆతిధ్యమియ్యవచ్చు. మనస్సులేని మర్యాదలను అతిగా చూపనక్కరలేదు. ఇంటికి వచ్చిన బంధువులకు వీలైనది చేతబెట్టి, వారుచిరకాలం బాగుండాలని ఆ దైవాన్ని ప్రార్థించవచ్చు. మనస్సులో వారిని గూర్చి వెఘపడుతూ మంచి మంచి బట్టలను

పైకి కట్టబెట్టనక్కరలేదు. మనసు ముఖ్యం. మమత ముఖ్యం. ప్రేమతో నిండిన హృదయం అన్నింటికన్నా ముఖ్యం. నిజమైన విలువలకుదూరమై, విలువలుకాని విలువలవెంట ఎందుకనో ఆధునిక మానవుని మనస్సు అతిగా పరుగెడుతున్నది. కాని విలువల వెంట పరుగుపెడుతున్న మనసునకు నిజమైన విలువలేమిటో తెలియజెప్పగలిగినప్పుడుగాని, ఈ ఆధునిక జీవనవిధానంలోని సంక్షోభం సమసిపోదు.

## వడిలిన కూరలు - వైరాగ్య సాధన

అది ఒక గ్రామం. ఆ గ్రామంలో ఒక గృహస్థు. ఆ గృహస్థుకు ఒక చిత్రమైన లక్షణం. ఆ లక్షణాన్ని పరామర్శించటం ఇప్పుడు మన అధ్యయనానికి ఎంతైనా అవసరం.

ఆ గ్రామంలో వారానికొకరోజు సంత జరుగుతుంది. గృహస్థుసంతకు వెళ్ళి వారానికి సరిపడా కూరలుకొని తెస్తాడు. తెచ్చి ఇంటిలో పోస్తాడు. పోసినప్పుడు అవి నవనవలాడుతూ ఉంటాయి, చక్కగా.

చక్కగా నవనవలాడుతూ ఉన్నవాటిని వండుకొని హాయిగా తినవచ్చునుకదా ! కాని వాడలాచేయడు. నవనవలాడుతున్న ఆ కూరల్ని ఒక ప్రక్కగా అట్టిపెట్టి గతవారం మిగిల్చిన అవశేషాలను ఇవతలకు తీస్తాడు. వడిలి ఇలకరుమకుపోయిన ఆ కూరల్ని ఆ పూటకి వండుకుంటాడు.

మర్నాడు తీరికగా క్రిందటిరోజు తెచ్చుకున్న సంత కూరల్ని ఇవతలకు తీస్తాడు. అప్పటికే ఒకరోజు అయింది కదా అవి తెచ్చి' ఆకారణాన అందులో కొన్ని వడిలి ఉంటాయి. ఆ పూటకు ఆ వడిలిన వాటిని వండుకుంటాడు. వడిలాయికదా వీటిని వండితే సరిపోతుంది అనుకొని మర్నాటికి ఆ ఉన్న కూరల్లో కొన్ని వడులుతాయి. ఆ పూటకు అవి వండుకుంటాడు. మర్నాటికి మరికొన్ని వడులుతాయి. 'ఇలా జీవితం పొడుగునా వడిలిన కూరల్నే తింటాడు వాడు. వడలిన కూరల్ని గాని నేను వండు కోను సుమా ! అని శపథం పట్టాడా అన్నట్లుగా తయారవుతాడు.

అలాకాక, సంతరోజున క్రొత్తగా కూరల్ని తీసుకుని రాగానే గతవారపు అవశేషాల్ని కొంచెం అవతల పారవేయ గలిగితే ఏ పశువులకో అందించగలిగితే ఆనాటినుండి జీవితమంతా నవనవలాడే కూరగాయల్నే తినవచ్చుగదా ! ఆ అవశేషాల్ని వదలగలిగే ఆ మాత్రపు వైరాగ్యం మనస్సుకులేని కారణాన రాని కారణాన జీవితాంతం వడలిన కూరల్ని తింటూ జీవితంలో రుచిఅన్నది అనుభవించకుండా, బ్రతకాలి కొబట్టి బ్రతుకు తున్నాము అన్నట్లుగా బ్రతకవలసి వస్తున్నదికదా ! ప్రకృతి మనకుఅన్నీ అమర్చిపెడుతున్నా, చిన్న తెగింపు మనమనస్సుకు లేని కారణాన జీవితం మొత్తానికి రుచి అన్నది లేకుండా చేసు కొనవచ్చు మనం అని రుజువౌతూ ఉన్నది కదా ! పనిగట్టుకొని మనం రుచిలేకుండా చేసుకుంటూ, దైవం మమ్మల్ని సరిగ్గా చూడటంలేదు. కాలం మాకు కలసిరావడం లేదు. అని అనుకో వడం న్యాయమేనా ? జీవితంలో మనం సుఖపడాలీ అంటే, సుఖ మనే రుచిని మనం అనుభవించాలీ అంటే ఈ వడలినకూరల

కథలోలాగ కొన్ని చిన్న చిన్న త్యాగాలను మనం చేయవలసి ఉంటుంది. అలాచేయడానికి మనకు మనస్సు ఒప్పాలి. అలా మనస్సు ఒప్పడాన్నే పెద్దలు 'వైరాగ్యం' అన్నారు. మనకు వైరాగ్యం ఒంటబడుతున్నదో లేదో తెలియడానికి ఈ చిన్న చిన్న సన్నివేశాలు చాలు అన్నారు. మనలోని టెంపరేచర్ని చూడటానికి థర్మామీటరు ఎలాంటిదో, మనలోని వైరాగ్యపు స్థాయిని పట్టిచూపడానికి ఈ చిన్న చిన్న సన్నివేశాలు అలాంటివి. ఇవిచాలు మన బ్రతుకును బట్టబయలు చేయడానికి. ఇవి చాలు మనం బాగుపడదలుచుకుంటే, మనలను ముందుకు నడిపించడానికి. ఏమంటారు ? ఇప్పుడేమంటారు ? మీ ఇంట్లోకికూరలు కొన్నప్పుడు మీరేమంటారోచూడాలి.

## ఇంటి చుట్టూ - ఒంటి చుట్టూ

ఒకాయన కట్టక కట్టక ఇల్లుకట్టాడు. కొంతైనా కలిసి వస్తుందికదా అని రెండు పోర్షనులుగా కట్టి, ఒక పోర్షన్ను అద్దె కిచ్చాడు. అద్దెకిచ్చాడు అన్నమాటేగాని, ఆతడి మనస్సంతా ఆ పోర్షన్లోనే తిరగడం మొదలుపెట్టింది. ఇక లాభంలేదని మనస్సుతోపాటు ఆయనా ఆ ఇంటిచుట్టూ తిరగడం మొదలు పెట్టాడు. ద్వారాలలోనుండి, కిటికీలలోనుండి, దొరికిన ప్రతి సందులోనుండి ఆ పోర్షన్లోనికిచూస్తూ, ఆ భాగంలోని ప్రతి అంగుళాన్ని నిరంతరం తీక్షణంగా పరిశీలించసాగాడు. ఆ ఇంట్లో ఉన్నవారెవరైనా ఆ గోడలకు ఆనుకొని కూర్చుంటున్నారే

మోనని అతని భయాల్లో ఒకటి. అలాకూర్చోవడమే జరిగితే అలా కూర్చున్నప్పుడు వాళ్ళ తలలు ఆ గోడలకు ఆనితే, ఆ తలలునూనె వ్రాయబడిన తలలై ఉండి, ఆ నూనె గోడలకు అంటితే ఆ దృశ్యాన్ని అతడు చూడగలడా ? చూసి తట్టుకోగలడా కనుక అసలు గోడలకు ఆనుకోకుండా వాళ్ళను అదుపుచేస్తే సరి పోతుంది కదా ! అన్న భావనతో ఎవరు ఆనుకోబోతున్నా 'బాబూ ! కాస్త ఇవతలకు కూర్చోండి. ఇలా చెప్పానని ఏమీ అనుకోకండి. కొంచెం నా స్థానంలో ఉండి ఆలోచించండి. అని బ్రతిమాలుతూనే మందలించేవాడు. ఎప్పుడైనా ఒక చిన్న శబ్దం ఆ పోర్షన్‌లోనుండి వినబడితే 'ఏమిటాశబ్దం' అని పరికించి మరీ చూసేవాడు' వీలుచేసుకుని పరుగెత్తుకొని వెళ్ళి మరీచూసేవాడు. ఏమీలేదు. అతనిభయం ఏమిటంటే ఆ పోర్షన్‌కు చెందిన గోడ లలో దేనికైనా మేకులులాంటివి కొడుతున్నారేమోనని ! నిజంగా అలా కొట్టబడటం జరిగి ఆ దృశ్యం అతని కళ్ళబడిందనుకోండి, ఇక ఆ మేకు గోడమీదకాదు. తన గుండెమీద పెట్టి కొడుతున్న ట్లుండేది. వెళ్ళి ఆ మేకును లాక్కొని అవతల పారవేస్తేతప్ప అత నికి ఊపిరి ఆడేదికాదు. అలాగే ఆ పోర్షన్‌లో ఉన్న వాళ్ళు బట్టలు ఎక్కడ పెడుతున్నారోననీ సామానులుఎక్కడ సర్దుతున్నారోనని బల్లలు ఎక్కడ లాగుతారోననీ, కుర్చీలు మొదలైనవి ఎక్కడ ఈడుస్తారోననీ, దుమ్ముకాళ్ళతో ఎక్కడ నడుస్తారోనని, తడి కాళ్ళతో ఎక్కడ తిరుగుతారోనని అతనికి ఎంత భయమో ! అప్పుడప్పుడు అతనికి అనిపిస్తూఉండేది. 'ఇంతబాధను అనుభవి స్తున్నాం. ఈ ఇల్లుకట్టకపోయినా పోయేదేమోనని' అనుక్షణం ఆ పోర్షన్లోకి ఉన్న వాళ్ళకు అనిపించేది.—ఎరక్కపోయి దిగా మురా బాబూ ఈ పోర్షన్లోకి అని ఆ పోర్షన్లో ఉంటున్న వాళ్ళు

ఇంటాయనను ఏమిటండీ ఈ గోలంతా అని అడుగుదామను కుంటే అందుకు అవకాశం దొరక్కుండా చేశాడు. ఆయన తన ఇంట్లో వాళ్ళనికూడా అదే పద్ధతిలో అంత పన్నాలోనూ ఆరడి పెడుతున్న అతడిని ఇంకా అద్దెకున్న వాళ్ళు ఏమనగలరు ? కనీసం అతని భార్యాబిడ్డలకు చెప్పుకుని ఊరట పొందేటందుకుకూడ వీలు కలుగలేదు. ఎందువలన అంటే చెప్పడం ప్రారంభిస్తే తమ కన్నా వారే ఎక్కువ చెబుతారేమోనని ! ఆ యజమాని సమభావం అంతటిది. ప్రయత్నించి, ప్రయత్నించి గృహం కట్టాడు. ప్రయత్నించి,ప్రయత్నించి ఆ గృహాన్ని అలాగే నిలబెట్టు కోవాలని చూస్తున్నాడు. ఆ గృహం అతడి ప్రాణం. ధానికి ఏ మాత్రం జరగకూడనిది జరిగినా అతడు సహించలేడు. మరి ఇన్ని ఇబ్బందులు పెడుతుంటే ఆ ఇంట్లో ఉన్నవాళ్ళు ఇంకేం సుఖపడతారు. ఆఇంటినేం వినియోగించుకోగలుగుతారు? ఈ గృహా భిమానం ఎలాంటిదో, మానవులకు ఏర్పడే దేహాభిమానంకూడా అలాంటిదే. గృహాభిమానం గృహాన్ని వినియోగించకుండా ఎలా అడ్డుపెడుతున్నదో, దేహాభిమానం దేహన్ని వినియోగించ కుండా అలాగే అడ్డుపడుతుంది.

గృహాభిమానం కలిగిన ఆ ఇంటి యజమానికి గృహామే తాననిపించింది. గృహానికి ఏమి జరిగినా తనకు జరిగినట్లే విల విల లాడిపోయాడు. అతను. అలాగే దేహాభిమానం కలిగిన మని షికి దేహమే తాననిపిస్తుంది, దేహానికి ఏం జరుగుతున్నా తనకు జరుగుతున్నట్లే అనిపిస్తుంది.

దేహాభిమానం కలిగిన వారిలో కొందరు దేహాన్ని అతిగా పట్టించుకుంటారు. దేహం అందంగా కనపడాలనీ, ఆరోగ్యంగా నిలబడాలనీ, యౌవనాన్ని కోల్పోకుండా ఉండాలనీ, నలుగురి దృష్టినీ ఆకర్షించాలనీ ఎంతగానో తాపత్రయపడిపోతూ ఉంటారు. రోజులో ఉన్న సమయమంతా వారి ఈ తాపత్రయానికే సరిపోతుందా ? లేదా ? అన్నట్లుగా ఉంటుంది వాళ్ళకి. అయితే, ఇవన్నీ అత్యంత అవశ్యకమైనవి. వీటికి కాకపోతే ఇంక దేనికి సమయాన్ని ఖర్చుపెడతాం ? అనిపిస్తుంది. దానితో దేహ సేవకే జీవితకాలం ఖర్చుఅయిపోతుంది. మరి ఇక దేహంతో చేయవలసిన పని ? ఆ ఆలోచనకు కూడా అతనికి అవకాశము న్నట్లు కనబడదు. అతనికి కనబడుతున్నదల్లా ఈ దేహానికి సేవ చేయడమే, దేహ నిర్వహణమే అతని పరమావధి. ఒకవేళ వృత్తి వ్యాపారాదులు చేసినా అవికూడా ఈదేహనిర్వహణకోసమే.

దేహాభిమానంకలవారిలో రెండవ తెగవారుంటారు. వారు దేహాన్ని తెగ ఇబ్బంది పెడతారు. పైగా దానినంతా భక్తి అను కోమంటారు. బాగా పుణ్యం రావాలని పొడి మడులనుండి తడి మడులదాకా వెళ్ళి తలమునకలుగా దేహాన్ని తడారనీయకుండా నడిపిస్తుంటారు. దేవుడికై ఉపవాసాల పేరిట దేహాన్ని మాడ్చి వేస్తూ ఉంటారు. ఆహారస్వీకరణకు ఎంతదూరంగా ఉంటే, దేవుడు అంతగా మెచ్చుకుంటాడని భ్రమపడతారు. నిజానికి మెచ్చుకుంటాడా అతడు? తీవ్రంగా నొచ్చుకుంటాడు. దైవస్మరణకు అనుకూలమైన దేహస్థితి కోసం తేలికరైన ఆహారాన్ని స్వీకరించమని చెబితే అసలాహారమే లేకుండా చేసి శరీరమే తేలిపోయేటట్లు చేస్తున్నారు. ఈ మడులు ఈ ఉపవాసాలు

అన్నీ దేహపరమైనవే అయినప్పుడు, ఇంతకూ భక్తి అబ్బ వలసింది ఎవరికి? దైవం ప్రసన్నం కావలసింది ఎవరికి? ఇది ఆలోచించవలసిన విషయం. దేహమే నేనన్న భావనే ఈ దైహిక మైన వాదస్థానికి గూడా తావిస్తున్నది. ఇంతకూ పద్ధతి నేర్చుకో వలసిన మనస్సు అలాగే ఉండి పోతున్నది. మోక్షం రావల సింది దేహానికా, మనకా? దేహాభిమానంతో కూడిన దైవ భక్తిలో ఇంత ప్రమాదమున్నది. దేహానికి మడికట్టి నేను మడి కట్టుకున్నాను.' అంటున్నాం. దేహానికి అన్నం పెట్టడం మానేసి నేను ఉపవాసం ఉన్నాను.' అంటున్నాం. మరి ఇక్కడ 'నే నంటే దేహమనేగా అర్థం. అలాంటప్పుడు ఇది దేహాభిమానంకాక ఏమౌతుంది? కాని దీనిని మనం దేహాభిమానం అనుకోం. ఇదంతా దైవభక్తి అనుకుంటాం. దేహసేవలో కాలం గడుపుతున్నవాడికి ఎంత దేహాభిమానం ఉన్నదో, దేవునిసేవలో కేవలం దేహాన్ని ఇబ్బందులపాలు చేస్తున్నవాడికీ అంతే దేహాభిమానం ఉన్నది. తెలియక మనం మొదటివాడిని 'భోగి' అంటున్నాం. రెండవ వానిని 'యోగి'గా జమకడుతున్నాం. నిజానికి ఈ ఇద్దరూ తామే దేహమనుకొని, దేహమే తామనుకొని ప్రవర్తిస్తున్నవారే! దేహాభిమానంకలవాళ్ళు దేహాన్ని ముద్దయినా చేస్తారు. లేదా మాడ్చనయినా మాడుస్తారు. కావలసింది ఈ రెండూ కాదు. దేహాన్ని సద్వినియోగం చేయగలగటం చేతకావాలి.

'దేహాభిమానం ఉండకూడదు.' అంటే దేహాన్ని నిర్లక్ష్యం చేయమని అర్థం కాదు. దేహమే నేనన్న భావంనుండి ఇవతలకు వచ్చి, దేహమనే ఆ దివ్య ఉపకరణాన్ని సద్వినియోగం చేయ మని అర్థం. నిజానికి దేహం తనను ముద్దు చేసినప్పుడూ సంతో

షించదు. తనను పూడపెట్టినప్పుడూ సంతోషించదు. తనను సద్వినియోగంచేసినకొద్దీ సంతోషిస్తుంది. మరింతగా సద్విని యోగం కావాలని కోరుకుంటుంది. దేహమనే ఉపకరణం మనకు సహకరించడానికి కావలసిన సౌకర్యాలన్నింటినీ, మనం దానికి సమకూర్చి పెట్టడం ధర్మం. అలాగే ఆ దేహం నిలబడుతూ ధర్మాచరణకు కావలసిన పాత్రతను పొందడానికై తగుమాత్రం సదాచారాన్ని కూడా దేహం చేత పాటింపజేయడం ఎంతైనా అవసరం. అయితే ఇందులో ఎక్కడా అతి ఉండకూడదు. అతి ఉంటే ఇక అదే ఉంటుంది. సద్వినియోగం ఉండదు. కనుక దేహసద్వినియోగానికి కావలసిన సౌకర్యాలూ, సదాచారాలూ అతి అన్నది లేకుండా పాటించడంలో మనం జాగరూకత వహిం చాలి. దేహమే నేనన్న భావం నుండి 'ఈ దేహం నాకు ఉప కరణం.' అన్న దర్శనాన్ని పొందినవారమై, ఆ దేహాన్ని చక్కగా పోషించుకుంటూ, చక్కగా సంస్కరించుకుంటూ, మన దైన జీవితకార్యాన్ని మనం నిర్వహించ వలసి ఉంటుంది. జీవిత కార్య నిర్వహణానికి ప్రధానమైన పనిముట్టు దేహమే. 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం.' అన్నది మన పెద్దల ఉపదేశం.

## ఆ ఇంటి గది - ఈ ఒంటి కథ

యూరప్ ఖండంలో పర్యటనచేస్తున్నప్పుడు ఒకసారి ఒక చిత్రం జరిగింది. పర్యటనలో భాగంగా మేమొకచోటికి వెళ్ళాం. అక్కడ ఒకామె మాకు ఆతిథ్యం ఇచ్చేటట్లుగా కొన్ని నెలల క్రితమే కార్యక్రమం రూపొందింపబడింది. సరే! ఆమె తన పరివారంతో స్వాగతం పలికింది. కుశల ప్రశ్నలు అయిన తరువాత, 'ఇదిగో ఈ పైననే మీకు ఏర్పాటు చేయబడిన గది ఉంది. మీకు కావలసిన సౌకర్యాలన్నీ అందులో అమర్చబడి సిద్ధంగా ఉన్నాయి. మీరు వెళ్ళి తగిన విధంగా విశ్రాంతి తీసు కోండి?' అంటూ నా సహచరుడికి తాళపు చెవులు అందించింది. మేం ముందుకు సాగాం. అమె అక్కడే నిలబడి ఉంది. మాతో గదిలోపలకి వస్తే మా స్వేచ్ఛకు ఇబ్బంది కలుగుతుందేమోనని ఆవిడ భయం. వాళ్ళ మర్యాద అది. పిలిస్తేగాని రారు వాళ్ళు.

అన్ని సౌకర్యాలు అమర్చి ఉన్నాయి, అని చెప్పబడిన ఆ రూములోనికి మేం ప్రవేశించాం. ఆశ్చర్యం ! ఆ రూము ఖాళీగా ఉంది. పరిశుభ్రంగా ఒక పనిముట్టుకూడా లేకుండా ఉంది. మాకు ఏం చేయాలో పాలు పోలేదు కాసేపు. ఆవిడ చెప్పింది ఈ గది గురించేనా? అని అనుమాన మొచ్చింది మాకు. కాని అనుమానించడానికి ఆస్కారం లేదు. ఆమె ఈ గదిపైపు చూపిస్తూ ఈ గది తాళపు చెవులే మాకిచ్చింది గదా! మరో గది తాళపు చెవులయితే ఈ గది ఎలా తెరుచుకుంటుంది? కనుక ఆవిడ చెప్పింది ఈ గదే! సందేహం లేదు. అయితే ఆవిడ అన్నటువంటి సౌకర్యాలన్నీ ఇక్కడ ఎక్కడ ఉన్నాయి అని.

ఈ గదిలో గోడలు తప్ప ఇంకేమీ కనబడటంలేదు. ఈ గోడల లోపల ఏమైనా దాచి పెట్టి వుందా ఈ సౌకర్యాలను? ఆ ఊహకు నాకు నవ్వొచ్చింది. నా ఊహ ప్రకారమే ఆమె ఈ గోడలలో దాచి పెట్టిందీ, చేసి పెట్టిందీ అనుకుందాం. ఒకవేళ అదే నిజమైనా, ఇక్కడ ఏం ముట్టుకుంటే, ఏం కొంపమునుగుతుందో అనిపించింది. ఆ గోడలవైపు చూస్తున్నకొద్దీ నాలో కొద్దిగా వెరపు కలుగ సాగింది. 'నాయనా! యీగదిలోని ఆ అన్ని సౌకర్యాలు ఏమిటో, ఆ ఇంటి ఆవిడనే వచ్చి ఒకసారి చూపించమని చెప్పు.' అంటూ సహచరుణ్ణి క్రిందకు పంపాను.

చిరునవ్వులు చిందిస్తూ ప్రవేశించింది ఇంటావిడ. ఆ గోడలలో మనచూపులకు అందకుండా మనగలుగుతున్న కొన్ని స్విచ్చుల లాంటివి ఉన్నాయి. వాటినొక్కొక్క దానిని నొక్క సాగిందామె. ఇంకేమున్నది! సౌకర్యాలన్నీ వ్యక్తమవుతున్నాయి. మంచాల దగ్గరనుండి సకలవస్తువులూ, ఆ గోడలనుండి ఇవతలకు వస్తున్నాయి, ఇక మీరు ఉపయోగించడమే తరువాయి అన్నట్లుగా. ఆశ్చర్యం! మాకు కావలసిన పండ్లు, తినుబండారాలు, కాఫీ మొదలైన పానీయాలూ, అన్నీ ఆ గోడలలో నుండి ఇవతలకు వస్తున్నాయి. ఒక్కొక్కటి యివతలకు వస్తూ ఉండగా, ఒక్కొక్క చిరునవ్వు నవ్వుతోందావిడ విలాసంగా. అలా గోడలలో దాగి ఉన్న రహస్యాలను మాకు పరిచయం చేసిందావిడ. 'మీకేం కావలసి వచ్చినా ఈ గోడలని అడగండి చాలు. ఇవి వెంటనే అందిస్తాయి.' అని చెప్పిందావిడ. అ అడగడం ఎలాగో కూడా నేర్పింది. సరే! మర్నాటినుండి ఆవిడను రప్పించవలసిన అవసరం లేకుండానే గోడలను మేము మచ్చిక

చేసుకోగలిగాం. ఇదంతా ఎందుకు చెప్పానూ అంటే ప్రకృతి మాత మానవుడికి అందించిన ఈ శరీరం ఉన్నదే! ఇది సరిగ్గా యూరప్ ఖండంలో ఆవిడ మాకు ఏర్పాటుచేసిన ఆగది లాంటిది.

ప్రకృతి మనకు అందించిన ఈ శరీరాన్ని మామూలుగా చూస్తే ఏముంది? అచ్చం ఆ గదిలాగానే ఉంటుంది. ఆ గదిలో గోడలు తప్ప ఇంకేమీ కనబడనట్లుగా, ఈ శరీరంలో కూడా సప్త ధాతువులతో కూడిన వివిధ భాగాల నిర్మాణం తప్ప ఇంకే మున్నది? 'జంతూనాం నరజన్మ దుర్లభం' అంటారు. ఇక్కడ ఈ శరీర భాగాలు తప్ప ఇంకేమీ కనబడటం లేదు. అనుకుంటూ అక్కడ మేము ఆ గోడల పైపు చూస్తూ నిలబడిపోయినట్లుగా నిలబడిపోతూ ఉంటారు. మరి ఈ దుర్లభమైన ఏర్పాట్లన్నీ ఎక్కడ ఉన్నాయి? అని! అది ఒక పట్టాన అంతుపట్టే విషయం కాదు. అవి మనకు కనబడాలీ అంటే, మనం ఆవిడ సహకారాన్ని అంటే ప్రకృతి మాత యొక్క సహకారాన్ని పొంది తీరవలసిందే. ఇంటావిడను పిలిస్తే ఆవిడవచ్చి, ఆశ్చర్యాలకూ, అనుమానాలకూ ఆస్కారంలేని స్థితిని మాకుకల్పించి నట్లుగా ప్రకృతి మాతను మనం పిలిస్తే, ఆమె ఈ శరీర నిర్మాణంలో దాగి ఉన్న దుర్లభమైన సౌకర్యాలనన్నింటినీ ఈవలకు వ్యక్తమయ్యేటట్లుగా చేస్తుంది. అవి మనకు అక్కరకు వచ్చే టట్లుగా చూస్తుంది. అలా అమెను మనం పిలవడానికి చేయువల సిన ప్రయత్నాన్నే మన పెద్దలు 'యోగాభ్యాసము' అన్నారు.

ఆ రోజున ఆగదిలో అలా గోడలవేపు చూస్తూ నిలబడిన మేము, ఆ ఇంటావిడను పిల్లవడానికి కొంచెం మొహమాట పడ్డామనుకోండి. లేదా కొంచెం బద్ధకించామనుకోండి. ఏం జరిగి ఉండేది. అలా ఖాళీగా కనబడుతున్న గదిలో ఆకటితో శోషిల్లి

తున్న మా కడుపులతో అలా గోడలవైపు చూస్తూ, ముడుచుకొని వట్టి నేలపైన పడుకోవలసి వచ్చేది. అలాగే ప్రకృతిమాతను పిలవడంలో మనమేమాత్రం మొహమాటపడినా, ఏ మాత్రం అశ్రద్ధచేసినా, ఈ శరీరం ఎందుకీయబడిందో తెలియకుండానే, ఈ శరీరంతో ఏం చేయవలసి ఉందో తెలుసుకోకుండానే, ఈ శరీరాన్ని సద్వినియోగం చేయకుండానే, శరీరంలో ఏదో ఒక మూలన మునగదీసుకుని జీవితాన్ని వెళ్ళమార్చుకోవలసి ఉంటుంది. జీవితమంటే ఇంతేనా? జీవితమంటే ఇదేనా? ఇంతోటి దానికి ఇంత సృష్టి, ఇంత హడావిడీ ఎందుకు? అని అనిపిస్తుంది. ఒక గానుగెద్దులాగ అలా తిరుగుతూ మధ్య మధ్యలో మోకాళ్ళ దండవేస్తూ మళ్ళీ తప్పదు కాబట్టి తిరుగుతూ, అలా తిరుగుతూ ఉండగానే ఏదో ఒక క్షణంలో ప్రాణాలను వదిలేయవలసి వస్తుంది. అలాకాక పెద్దల అడుగు జాడల్లో నడుస్తూ, వారికి శుశ్రూషచేస్తూ, ఈ శరీరాన్ని మనకిచ్చిన ప్రకృతిమాతకు సేవచేస్తూ, మన జీవిత నిర్వాహణలోనికి ఆమెను ఎలా ఆహ్వానించాలో నేర్చుకున్నట్లయితే అప్పుడు జీవితం ధన్యమవుతుంది. ప్రకృతిమాత ఈ దేహనిర్మాణంలో ఎన్ని వైచిత్రులు ఎలా దాగి ఉన్నాయో మనకు తానుగా పరిచయం చేస్తుంది. ఎంతమంది దేవతలు, ఋషులు, ఈ దేహనిర్వహణలో నిరంతరం పనిచేస్తున్నారో మనకు తెలియచెపుతుంది. వారిని మనకు సన్నిహితులుగా, స్నేహితులుగా రూపొందిస్తుంది. అప్పుడు ఈ దేహం, ఈ దేహం ద్వారా వ్యక్తమవుతున్న జీవితం ఎంతటి విలువైనవో, వాటిని ఎంతగా మనం సద్వినియోగం చేయవచ్చునో మనకు తెలిసి వస్తుంది. అలా తెలిసి వచ్చిన స్థితిలో లోకశ్రేయస్సు సాధించడం కోసం జీవిస్తున్న మనిషినే పెద్దలు పరిపూర్ణుడూ, జీవన్ముక్తుడూ అన్నారు.

# బంధము - జీవితము

ఏది బంధం ? ఏది మోక్షం ? ఇది చాలా సున్నితమైన అంశం. బంధంఅంటే అది ఏదో తెంచుకోవలసినదిగాను, మోక్షం అనగానే అదేదో స్వీకరించవలసిన కానుకలాగానూ అనుకొంటూ ఉంటారు చాలామంది.

ఒకాయన రమణ మహర్షి దగ్గరకు వెళ్ళి నమస్కరించి కూర్చున్నాడు. మౌనంగానే, మౌనంలోనే సమస్తాన్నీ దర్శించ గల దర్శింపజేయగల ఆ మహర్షి ఆ కూర్చున్న వాడిపైన ప్రేమతో పెదవి విప్పి ఇలా అడిగాడు .

ఇంతకూ మీకు ఏం కావాలి ?

నాకు మోక్షం కావాలి మహర్షి ! నాకు మోక్షం రావాలి.

మోక్షం రాదప్పా ! బంధం పోవాలిగాని.

ఆ మహర్షి వాక్యం వింటున్న అతనికి విచిత్రంగా తోచింది. మోక్షం రాదంటాడేమిటి ? రాకపోతే ఇక ఎలాగ ? అని.

కరుణా సముద్రుడైన ఆ మహర్షి కన్నులు విచ్చిచూచి సందిగ్ధంలో ఉన్న అతడికి ఇలా వివరించాడు : ఇదిగో చూడప్పా ! మోక్షం రాదప్పా ! అసలు ఉన్న స్థితే అది. ఉన్న స్థితే అది అయినప్పుడు ఇంకెక్కడినుండి అది మళ్ళీవస్తుంది. మానవుడికి మొదట మోక్షస్థితే అనుగ్రహింపబడింది. ఆ స్థితిని అలాగే అను

భవించటం చేతకాక, అతనే చెల్లాచెదురు చేసుకుని బంధనాలు తెచ్చుకుంటాడు. ఇక ఆ తెచ్చుకున్న బంధనాలు తొలగించుకోవడమే అతడు చేయవలసినపని. తొలగించుకుంటే అక్కడ ఉన్నది మామూలు స్థితియైన మోక్షమే. చిత్రమేమిటంటే మోక్షము మనమామూలుస్థితి. మన సహజమైనస్థితి అది. దానిలోనుండి అటూఇటూ చెదిరితేనే బద్ధులమౌతున్నాం. ఇలా బద్ధులం కావడంవల్ల మనకు అసహజమైన స్థితిలో మనం పెట్టబడుతున్నాం. అందుకే నేనన్నది—మోక్షం రాదప్పా! బంధం పోవాలిగాని! అని.

చూడండీ! మహర్షి ఇచ్చిన వివరణ మరింతగా బోధపడేందుకుగాను మీకు ఒక చిన్న సన్నివేశం చెబుతాను.

ఒకాయన శ్రావణ పౌర్ణమిరోజున గోదావరిలో స్నానం చేసి, జందెం మార్చుకోవడానికి ఉద్యుక్తుడౌతున్నాడు. జందెం ఎలా ఉంటుందో మీకు తెలుసుకదా! ఆ జందాన్ని వేసుకోవడానికి వీలుగా, తీసిపట్టుకోవడానికి చాలఒడుపూ, అభ్యాసమూ ఉండాలి. పాపం ఆయన వేసేసుకోవాలన్న తొందరలో ఉన్నాడేమో కొంచెం ఇలా లాగాడు. అంతలోనే చిక్కుపడి పోయిందా జందెం.

ఇప్పుడెలా? అసలే తొందరలో ఉన్నాడు. సమయంమించిపోతుందని మరి కాస్త గట్టిగా లాగాడనుకోండి. ఆ చిక్కురాదు సరికదా! మరింతగా, చిక్కుపడి బిగిసిపోతుంది. పోనీ ఈ చిక్కుపడినది ఇబ్బంది పెడుతోందని దీన్ని జందెంనుండి తెంచివేద్దామా అని ఆలోచిస్తే, వచ్చిన చిక్కేమిటంటే ఈ చిక్కుగా ఉన్నదీ,

చిక్కుల్లో ఉన్నదికూడా జందమేనాయె ! గట్టిగాలాగడానికి వీలు లేదు. త్రెంచి పారవేయడానికి అసలేవీలులేదు.

మరిప్పుడేం చేయాలి ? ఎలాగైనాసరే ఓర్పుతో, ఒడుపుగా ఆ చిక్కురూపాన్ని ధరించినదాన్ని తిరిగి జందెంరూపంలోనికి తీసుకురావాలి. ఇలా ఓర్పుతో ఒడుపుగా ప్రయత్నించాలి అని చెప్పడానికే "యోగః కర్మసు కౌశలం"— అన్నాడు గీతలో శ్రీకృష్ణుడు.

దీనిని బట్టి ఏం తెలుస్తోంది. జీవితంలో మనంత్రెంచి పార వేయాల్సిందంటూ ఏమీలేదు. మనం బంధం అని పిలుస్తున్నది కూడా జీవితంలోని భాగమే. కనుక దాన్ని బంధస్థితినుండి మామూలుస్థితికి తీసుకొని వచ్చేటందుకు మనం ఒడుపును చూపించగలగాలి అని. అలాంటి ఒడుపు మనకు జీవితనిర్వహణలో సిద్ధించడానికే పెద్దలు యోగసాధన మార్గాన్ని నిర్దేశించారు.

మోక్షమంటే విడువబడటం అని అర్థం. చేతకాక చిక్కులు పడవేసుకున్న స్థితినుండి విడువబడి, సహజమైన స్థితిని మరల పొందగలగడమే మోక్షం.

# దంత ధావనం - సంధ్యావందనం

ఒకాయన అన్నాడుకదా ! ' సంధ్యావందనం చేయడం వల్ల పుణ్యమేమయినా వస్తుందా అండీ ?' అని. సంధ్యావందనం చేయడంవల్ల ప్రత్యేకంగా పుణ్యమేమిరాదుగాని చేయకపోతే మాత్రం పాపంవస్తుంది. ఇలా చెప్పినందుకు మీరేమీ ఆశ్చర్య పడనక్కరలేదు. మనందరం తెల్లవారి లేవగానే మొహం కడుక్కుంటున్నాం. మొహం కడుక్కోవడంవల్ల ప్రత్యేకంగా ఏమిటి కలిసి వస్తున్నది మనందరికీ ? కడుక్కోకపోతే మాత్రం నోరు వాసన కొడుతుంది. పళ్ళుపుచ్చిపోతాయి. అందువల్ల కడుక్కుంటే ఏమీ రాదని మానేయకూడదు. అలా చేస్తే కుళ్ళిపోతాం. సంధ్యా వందనం సంగతీఅంతే. లేవగానే మొహం కడుక్కోవడం ఎంతో; సంధ్యావందనం చేయడమూ అంతే. అది మనస్సును కడుక్కోవడం, శరీరం సిద్ధం కావడానికి మొహం కడుక్కోవడం స్నానం చేయడం మొదలైనవి ఎలాంటివో, మనస్సు సిద్ధం కావడానికి సంధ్యావందనం మిగిలిన పూజాదికాలూ అలాంటివి.

అయితే ఈ సంధ్యావందనం ఒకేరూపంలో ఉండాలని లేదు. ఉభయ సంధ్యలలో దైవాన్ని ప్రార్థిస్తున్న వారందరూ సంధ్యావందనం చేస్తున్నవారే అవుతున్నారు. వారేమతం వారైనాసరే. విధానం ఏదైనాసరే. ప్రార్థించటం ప్రధానం. మహనీయులందరూ ప్రార్థనకు సంధ్యాసమయాలనే ఎక్కువగా నిర్దేశిస్తూ ఉంటారు.

కొందరు త్రికాల సంధ్యావందనాన్ని ఆచరిస్తారు. అంటే ప్రొద్దున, సాయంకాలంతోబాటుగా మిట్ట మధ్యాహ్నంకూడా దైవాన్ని ప్రార్థిస్తారు. ఇంకొందరు వీలుచేసుకుని అర్ధరాత్రికూడా ప్రార్థించేవారున్నారు. చెప్పొచ్చేదేమిటంటే, ఇవన్నీ సంధ్యా వందనాలేననీ, ఏదోరూపంలో సంధ్యావందనాన్ని ఆచరించటం మనిషికి మంచిదనీ !

## పానకము – వేదము

వేదాలకథ చిత్రమైంది. నిజానికి ఇపుడు మనకు దొరుకుతున్నది ఆ వేదాలలో కొంతభాగం మాత్రమే. అనాదికాలం నుండి కాలక్రమంలో అవి అనేకసార్లు సంకలనం చేయబడ్డాయి. సంకలనం చేయబడ్డాయి అంటే ఏమిటి ? దొరికినంతవరకు ఏరి కూర్పుజేసుకోబడ్డాయి అని అర్థం. మరింక దొరకనివి, దొరకాల్సినవీ ఎన్నున్నాయో !

అయితే దొరక్కుండా పోయిన వేదాల మాటేమిటి ? వాటిలో ఏముండి ఉంటుంది ? అవి ఎలాంటి అనుభూతినందించి ఉంటాయి ? అని మనం వ్యథ చెందనక్కరలేదు. శ్రీరామ నవమి సందర్భంగా ఒక గంగాళం నిండా మంచి పానకం కలిపారనుకోండి, అందులో పడవలసినవి అన్నీ మంచిపాళ్ళల్లో పడ్డాయనుకోండి. బాగా తయారైనా ఆ పానకాన్ని రుచిచూడటానికి ఏం చేస్తాం ? ఒక గరిటెతో ఆ గంగాళంలోని పానకాన్ని

తగుమాత్రంగా ఇవతలకు తీసుకుని నాలుకపైన వేసుకుంటాం. ఇప్పుడిక ఆ గంగాళంలోని మిగతా పానకాన్నంతటినీ మనం శ్రమపడి రుచిచూడనక్కరలేదు. గంగాళంలోని పానకం ఎలా ఉందో గరిటెలోని పానకమే తెలియ జెబుతోందికదా! సరిగా ఇలాంటిదే వేదాలకథకూడా. ఆ దొరకని వేదభాగాలు ఎలా ఉంటాయి అన్నది, ఈ దొరికిన వేదభాగాలే మనకు తెలియజెప్ప గలవు. కనుక ఈ దొరికిన వేదభాగాలను శ్రద్ధతో అధ్యయనం చేయడమే ఇప్పటి మన కర్తవ్యం.

## పంచదార బొమ్మ - మానవుడు

"ఈ వేదాలను అధ్యయనం చేస్తున్నదెవరో, అతడే ఈ వేదాలలో వర్ణింపబడినవాడు." "ఎవడైతే బ్రహ్మమును తెలుసు కుంటున్నాడో అతడు బ్రహ్మమే అవుతున్నాడు."- అన్న ఈ వేదవాక్యాలు ఎంత చక్కనివి. బోధపడుతున్నకొద్దీ అమృ తత్త్వాన్ని అందిస్తాయి ఇవి. ఈ వాక్యాల భావం అంతుపట్ట డానికి ఒంటపట్టడానికి ఒక ఉదాహరణ చెబుతాను చూడండి. ఒక గంగాళంనిండా పంచదార పానకంఉంది. పంచదారను పాకంపట్టి దానితో మనిషి బొమ్మనొకదానిని తయారుచేసి తీసికొనివచ్చి ఆ పానకంలో ముంచామనుకోండి. అపుడేమవుతుంది? క్రమంగా ఆ బొమ్మ కరగడం మొదలు పెడుతుంది. కరుగుతూ పానకం స్వరూపాన్ని పొందుతుంది. పంచదార బొమ్మ కాస్తా క్రమంగా పానకం అయిపోతుంది. అట్లాగే మానవుడు దైవ

తత్త్వంనుండి ఘనీభవించినవాడు. అంటే ఆ పంచదార బొమ్మ వంటివాడు. పానకం ఉన్నదే అదే దైవతత్త్వం. పానకాన్ని చేరిన బొమ్మలాగా దైవతత్త్వాన్ని రుచిచూడటం మొదలు పెట్టిన మనిషి దైవమై పోతున్నాడు. దైవమై ఎక్కడికీపోడు. ఎక్కడి కన్నా పోవడానికి దైవం లేనిదెక్కడ? అందుకని దైవమై నిలు స్తాడు. దైవంగా ప్రవర్తిస్తాడు. శ్రద్ధతో మనస్సు పెట్టి వేదాలను గానం చేసినా, లేదూ వేదంలాంటిదే మరో ప్రార్థనను చేసినా, మనిషికి లభించే దివ్య స్థితి అదే.

## గుండిగలు - గుండెలు

పిసినారి తనం చిత్రమైంది. వాడికెంతసేపూ దాచుకో బుద్ధే అవుతుంది తప్ప ఖర్చుపెట్ట బుద్ధి పుట్టదు. సద్వినియోగం చేయాలని అసలనిపించదు. సద్వినియోగం చేయడం మాట అలా ఉంచి, అలా సద్వినియోగం చేస్తున్నట్లు కలవచ్చినా కూడా వాడు భరించలేడు. కలే కాదు, కనీసం అలాంటి ఊహ వచ్చినా వాడు తట్టుకోలేడు. ఒక పిసినారి దగ్గరకు అతడి స్నేహితుడు వచ్చి ఎలాగూ సద్వినియోగం చేయడానికి నీకు బుద్ధిపుట్టదు కాని, కనీసం అలాంటి సన్నివేశం ఒకటి చెబుతాను, ఊహించి చూడు అన్నాడు. వద్దు, వద్దు అని అందామనుకుంటున్న పిసి నారిని చేతులతో వారిస్తూ, మిత్రుడు ఇలా చెప్పడం మొదలు పెట్టాడు. నువ్వొక అన్న సంతర్పణ చేస్తున్నావనుకో. చిన్న ఎత్తునేలే! అక్కడొక గాడిపొయ్యి ఉంది. ఆ పొయ్యి మండు

తున్నది. దానిమీదేమోఒక మూడు గుండిగలు పెట్టారు. గుండిగల్లో ఎసరు త్రెళ్ళుతోంది. ఆ ఎసట్లోనేమో బియ్యం - బియ్యం అని ఆ వాక్యాన్ని పూర్తి చేయబోయే లోపునే ఆ పిసినారి 'వద్దు వద్దు. ఇంకేమీ చెప్పొద్దు. నేను తట్టుకోలేను. ఎందుకలాంటివి చెప్పి నన్ను యిబ్బంది పెడతావు.' అంటూ మూర్ఛపోయినంత పనిచేశాడు. గుండిగలు అనేప్పటికే వాడి గుండెలు గుభేలుమన్నాయి. ఇది నిజం కాదురా బాబూ, ఊరికే ఊహించరా నాయనా! అన్నా సరే వాడు గడగడలాడి పోయాడు. ఊహించడం నా తరం కాదన్నాడు. మంచిపని చేయడానికే కాదు. కనీసం ఊహించడానికి కూడా చాలా సంస్కారం, మంచి నేపథ్యం ఉండి తీరాలని తెలియ జెబుతోంది, ఈ సన్నివేశం.

## సన్నివేశం - సద్వినియోగం

రేడియోలో తనకు ఇష్టమైన గాయకుడు పాడినపాట ఒకటి వస్తున్నది. ఆ పాట వస్తున్నదన్న సంబరంలోపడి ప్రక్కనున్న వారినికూడా పిలిచి వాళ్ళ వీపులు చరిచి, చూశారా! ఈ పాట వస్తోంది. ఎంత బాగా పాడాడో చూశారా? ఇలాంటి పాటలు అతడు ఎన్ని వందలు పాడి ఉంటాడు? పాటగాడు అంటే ఇతనే. పాట అంటే ఇతడు పాడిందే.' అని ఏమేమో చెప్పేస్తున్నాడు వాళ్ళందరికీ. ఇంతలో ఆపాట కాస్తా అయిపోయింది. అతడు విన లేదు. తాను పిలిచిన ఆ మిగిలిన వాళ్ళనూ విననీయలేదు.

పెళ్ళికని ఎంతో శ్రమపడి వెళతారు. తీరా పెళ్ళి జరిగే సమయానికి అలా రోడ్డు మీద కబుర్లు చెప్పుకుంటూనో, గదిలో పేకాట ఆడుకుంటూనో ఉండిపోతారు. వీళ్ళైతే ఆ వేళకు వెళ్ళి అక్షింతలు వేస్తారు. లేదా అందుకు కూడా బద్ధకం వేస్తే ప్రక్కనున్న వాళ్ళ చేతికిచ్చి, మా అక్షింతలుకూడా మీరే వేసి రండి.' అని చెబుతారు. రోడ్డుమీద కబుర్లు చెప్పుకోవడానికి, గదిలో పేకాట ఆడుకోవటానికి, పిల్లామేకలతో, పెట్టెబేడలతో, నానా రొష్టూపడుతూ అక్కడదాకా వెళ్ళనక్కరలేదుకదా ! వెళ్ళింది పెళ్ళికోసమే. పెళ్ళిచూడాలనే. ఆ దంపతులను తృప్తిగా ఆశీర్వదించాలనే, కాని అది జరగడంలేదు. అది జరగకుండానే పెళ్ళి అయిపోతోంది. పెళ్ళినవారు వచ్చేస్తున్నారు.

అదృష్టవశాన ఒకడు ఒక మహనీయునికి దగ్గరౌతాడు. ఆ దగ్గరైనవాడు ఆ మహనీయత్వాన్ని అనుభవించవచ్చుగదా ! కాని అలా జరగనీయడు! తనకు నచ్చిన ఆ మహనీయుణ్ణి గూర్చి వాడ వాడలా చాటాలనిపిస్తుందివాడికి. అలా చాటి చాటి అనేకమందిని ఆయన శిష్యులుగా రూపొందించాలనిపిస్తుంది. మిగిలినమహనీయులకన్న ఆయనఎలా గొప్పవాడో,దానిని నిరూపించాలని అనిపిస్తుంది. మిగిలిన మార్గాలకన్నా ఆయన చూపుతున్నమార్గం ఎలావిశిష్టమైనదో నిరూపించాలనిపిస్తుంది. చేరినవాడు ఇలా ఈ హడావిడిచేస్తూ ఉండగానే ఆ మహనీయుడు తన జీవితకాలాన్ని పూర్తిచేసుకుని పరలోకాలకు చేరుకోవడం జరుగుతుంది. మహనీయుడికి దగ్గరైనవాడు, ఆ మహనీత్వాన్ని అను

భవించవచ్చుగదా ! ఆయనను మరింతదగ్గరగా దర్శించే ప్రయత్నం చేయవచ్చుకదా ! ఆయననుండి వ్యక్తమవుతున్న వెలుగునకు తనను తాను సమర్పణ చేసుకున్నప్పుడు ఆయనే ఇతనిని అన్నివిధాలా సంస్కరించుకొని, తనకొక వాహికగా మలచుకొని, అతడిద్వారా లోకహితం జరగడానికి ఎన్ని విధాలుగా అవకాశం ఉన్నదో అన్ని విధాలుగానూ ఉపయోగపరిచేవాడు కదా ! కాని అలా జరగలేదు. ఈ వెళ్ళినవాడు అలా నిలబడలేదు. ఇతని హడావిడిలో ఇతను పడ్డాడు. అంతలో ఆయన దేహాన్ని విడిచాడు. ఇక మిగిలింది ఇతనికి హడావిడే.

చూడండీ ! రేడియోపాటను వినాలని కోరుకుంటూనే వినలేకపోయాడు మొదటి సన్నివేశంలోనివాడు. పెళ్ళిచూడాలని వెళ్ళినవాళ్ళు పెళ్ళిచూడకుండానే తిరిగివచ్చారు రెండవ సన్నివేశంలో. మహనీయుడికి దగ్గరై, ఆ మహనీయుని పూర్తిగా దర్శించే అవకాశం లభించినా తన హడావిడిలోపడి ఆ దర్శనాన్ని నోచుకోలేకపోవడం జరిగింది మూడవ సన్నివేశంలో. ఈ మూడు సన్నివేశాలూ ఏం తెలియజెబుతున్నాయి ? కావాలని కోరుకుంటున్న అవకాశం ఎదురుగా వచ్చి నిలిచినపుడు, ఇంతగా కావాలని కోరుకుంటున్నవారుకూడా ఆ సన్నివేశాన్ని అనుభూతి చెందలేకపోతున్నారూ, సద్వినియోగం చేసుకోలేకపోతున్నారు అని. ఎందుకని ఇలా జరుగుతోంది ? కావాలని కోరుకుంటున్నవాడు ఆ సన్నివేశాలను అనుభవించకూడదని అనుకుంటాడా ? అనుకోడు. కాని అతడు అనుభవించలేకపోతున్నాడు. అదీ చిత్రం ! "ఇలా కావాలని కోరుకుంటున్నాను. తీరా ఆ సన్నివేసాలు నడిచి వచ్చినపుడు వాటిని అనుభవించలేకపోతున్నాను. అనుభూతి చెందలేక పోతున్నాను." అన్న సత్యాన్నినకూడా

అతడు గమనించలేకపోతున్నాడు. ఇది ఇంకా విచిత్రం ! మనిషి సాధన చేయవలసింది ఇక్కడే. యోగసాధనకు పరమావధి ఇదే. నడిచివచ్చిన సన్నివేశాలను అనుభూతిచెందుతూ, సద్వినియోగం చేయగలగడంకన్నా మానవుడికి చేతకావలసింది మరొకటిలేదు. అది చేతకానినాడు ఈ భూమిపైనమానవుడు అనుభవించగలిగింది కూడా ఇక ఏమీలేదు. కనుక నడిచివస్తున్న సన్నివేశాల యెడల మనం ఎలా ప్రవర్తించగలుగుతున్నాం ? అన్నది ఎప్పటికప్పుడు గమనించుకుంటూ ఉండవలసిన అంశమే.

సన్నివేశాన్ని సూటిగా అనుభూతిచెందుతూ నిర్వహించగలగడమనేది ఒక దివ్యమైనకళ. ఆ కళలో మనం పారీణులము కావలసిఉంది. నడచి వెళ్ళిన సన్నివేశాలు మరల రమ్మన్న రావు. కనుక నడచి వెళుతున్న సన్నివేశాల యెడల మనం మెలకువకలిగి నడుచుకోవాలి. దైవం తానను గ్రహించదలచినప్పుడు తన అనుగ్రహాన్ని సన్నివేశాల రూపంలోనే వ్యక్తంచేస్తూ ఉంటాడు. ఈ సత్యాన్ని మనం గమనించుకోవాలి. అలాంటప్పుడు ఆ సన్నివేశనిర్వహణమే అతడిని మనం ఆరాధించుకునే మార్గంమవుతుంది.

## మీసాలు - భయము

మనిషి జీవితమంతా తనకున్న భయాన్ని పోగొట్టు కోవడం కోసం తాపత్రయ పడుతూ ఉంటాడు. చదువుకుంటే పోతుందేమో అనుకుంటాడు. పాపం ఆ తరువాత కూడా అలాగే ఉంటుంది. ఆ భయం ఉద్యోగం వస్తే పోతుందనుకుంటాడు. వచ్చిన తరువాత కూడా అలాగే ఉంటుంది. ఇల్లుకడితే పోతుం దనుకుంటాడు. కట్టినా అది అలాగే ఉంటుంది. డబ్బు సంపా దిస్తే పోతుందనుకుంటాడు. సంపాదించినకొద్దీ ఆ డబ్బుతోపాటు ఆ భయం కూడా అలా పెరుగుతూ వస్తూనే ఉంటుంది. ఇంతకీ అతడు భయాన్ని ఎలా పోగొట్టుకోవాలో తెలియక, మరింత భయపడే స్థితిలో పడిపోతాడు. మనం సంపాదించే సంపానదలో సంపదలూ, మనం కట్టే ఇళ్ళూ, మనం చేసే ఉద్యోగాలూ, మన భయాన్ని ఎలా పోగొట్టగలుగుతాయయ్యా? భయం మనలోపల ఉన్నది. మనలో ఉన్నది. బయటలేదు. బయట ఎన్ని చేసినా ఆ భయం పోదు. ఆ జరిగేదేదో మనలో జరగాలి. అప్పుడు ఆ భయం పోయేటందుకు అవకాశం ఉంటుంది.

మీకో చిన్న ఉదాహరణ చెబుతాను. ఒకతనికి దొంగ లంటే భయం. ఆ భయం పోగొట్టుకోవాలని వాడి తాపత్రయం. అందుకని వాడేంచేశాడూ! ఆలోచించి, ఆలోచించి ఒక నిర్ణ యానికివచ్చి ఒక శుభముహూర్తంలో మీసాలు పెంచడం ప్రారం భించాడు. వాటికేం పాపం అవి బాగానే పెరిగాయి. బాగా పెరిగిన తర్వాత ఒకనాడు అద్దంలోచూసుకుంటూ అనుకున్నాడట.

మీసాలు బాగానే పెరిగాయి. ఈసారి దొంగలు వచ్చినా ఇక మన కేమీ భయం లేదూ' అని.

వాడు అంతగా సంకల్పించి ఆహ్వానించినప్పుడు రాక పోతే ఎలాగ? అని ఒకరోజున దొంగలు రానే వచ్చారు. 'లేవరా, లే! తాళం చెవు లెక్కడ? ఏమిట్రా ఆ మత్తు నిద్ర? మేం వచ్చి నట్లు తెలిసి కూడా, ఇట్లా నిద్ర పోవడానికి నీకెన్ని గుండెల్రా?'- అని వాళ్ళు గద్దించే టప్పటికి, ఆ భయంకరమైన సుప్రభాతా లతో మేల్కొన్న మనవాడికి ముచ్చెమటలు పోస్తున్నాయి. భయంవేసి వణికిపోతున్నాడు వాడు, ఎప్పటిలాగానే. అలా వణు కుతూ వణుకుతూనే, తన మీసాలసంగతి గుర్తుకువచ్చి వాటిని కొంచెంగా గమనించాడట ఎలాఉన్నాయోనని. పాపం, అవీ వణుకుతూ ఉన్నాయి, వాడితోపాటు! ఏమిటిలా జరుగుతోంది! పనికట్టుకుని పెంచిన మీసాలుకూడా ఇలా వణికి పోతున్నా యేమిటి!' అనిపించింది వాడికి. ఆ అ ని పిం చి న క్ష ణం నుండీ వణుకు మరింతగా పెరగసాగింది వాడికి.

మన నుండి మొలుచుకొచ్చిన మీసాలూ మొదలైనవి మనని భయంనుండి ఎలా రక్షించలేవో, మనం సంపాదించుకున్న ఆస్తిపాస్తులూ, మనచేత సమకూర్చబడిన సకల సిరిసంపదలూ కూడా మననలాగే భయాన్నుండి రక్షించలేవు. మనను భయం నుండి రక్షించుకోవలసినది మనమే. మనని మనం రక్షించు కోవడం మనకు చేతనై నిర్భీతిగా, నిశ్చింతగా మనని మనం నిలుపుకోగలిగిననాడు మనం సమకూర్చుకున్న వనరుల్ని, సంపదల్ని మనం సద్వినియోగం చేయగలుగుతాం. ఇలాంటి

సమర్థుని చేతుల్లో పడ్డాం కదా! అని ఆ వనరులూ, ఆ సంపదలూ కూడా ఆనందిస్తూ, ధన్యతను పొందుతాయి.

మనవల్ల సంపదలకు ధన్యతకలగాలి గాని, సంపదలవల్ల మనకు ధైర్యం కలుగుతుందన్న భ్రమలోమనం పడిపోకూడదు. అలా భ్రమపడమని పాపం! అవికూడా మనకు ఎప్పుడూ చెప్పలేదు. 'మీ భయం కోసం మమ్మల్ని చేరదీయకండి. ఆ విషయంలో మేము మీకు చేయగలిగింది ఏమీలేదు. అప్పుడు ఆ భయపడుతున్న స్థితిలో మీరు మాతో చేయగలిగింది కూడా చాలా స్వల్పమే. అలా కాక మీరు ధీరులై కర్తవ్యనిర్వహణ కోసంమమ్మల్ని చేరదీయగలిగిననాడు ఆ సద్వినియోగంలో ఎనలేని హాయి ననుభవిస్తాంమేం'- అని ఘోషిస్తున్నాయి సకల వనరులూ, సిరిసంపదలూ.

## కోతి ముఖం - ఆంజనేయుడు

ఒకసారి గుంటూరు బజార్లో నడుస్తున్నాను. ఒకాయన కన బడి సంచితో సహా నమస్కరించాడు. ఆయన ముఖంలో నాకు చిత్రమైన మార్పు కనిపించింది.

'ఏమండీ ! మీరు ఆంజనేయ ఉపాసనచేస్తున్నారా ! అని అడిగాను .

ఆయన ముఖం వెలిగింది. ఈ మధ్యకొన్నాళ్ళుగా చేస్తు న్నాను. మీరెట్లా గ్రహించారు. ఆశ్చర్యంగా ఉందే ! అన్నాడు.

ఆశ్చర్యం సరేగాని, అంజనేయుడు అంటే, ఒక కోతిగా భావించి, ఆ రూపాన్ని ఆరాధిస్తున్నారుకదూ ! అన్నాను.

అంత అనుభూతిలోనూ ఆయన కొంచెం షాక్ తిన్నట్లయి, 'సార్ ! ఇదంతా మీరెట్లా గ్రహించేశారు. చాలా చిత్రంగా ఉందే. ఉన్నది ఉన్నట్లుగా చెప్పేశారు మీరు.' అన్నాడాయన.

ఇందులో చిత్రం ఏం లేదండీ ! ఆధ్యాత్మిక అంశాలలో కాస్తో ,కూస్తో అనుభవం ఉన్న ఎవరైనా మీ ముఖాన్ని చూస్తే, ఇట్టే ఈ అంశాలన్నీ చెప్పేయగలరు. ప్రస్తుతం మీ ముఖం వానరముఖాన్ని తలపిస్తూ ఉన్నది. ఆ ముఖంపై నున్న మీబొట్టు మీరు ఆంజనేయుని ఉపాసిస్తున్నట్లుగా ఘోషిస్తూ ఉన్నది. ఎందుకైనా మంచిది. మిమ్మల్ని హెచ్చరిద్దామని అడిగాను.' అన్నాను.

'ఏమని ఆ హెచ్చరిక ? నేనిక, ఆంజనేయుణ్ణి ఉపాసించ వద్దనా ?'—అన్నాడాయన.

ఆంజనేయుణ్ణి ఉపాసించవద్దనికాదు. అంజనేయుణ్ణి అలా ఉపాసించవద్దని, ఆంజనేయుడు అంటే కేవలం మనం చూస్తున్న కోతిలాంటివాడు అనుకోకండి. మన కోతులు వేరు. ఆ కోతులు వేరు. మన కోతులు మామూలు కోతులు. ఆ కోతులు కావాలని అలా వ్యక్తమైన కోతులు. వానరులు కామరూపులు. దివ్యశరీరులు అని రామాయణం చెబుతోంది. అందులోనూ ఆంజనేయుడు మరీ విశిష్టమైన తేజోమయరూపం కలిగినవాడు. అతడిరూపం మనం ఊహించడానికి అలవియైనదికాదు. ఆయన అనుగ్రహిస్తే మాత్రమే మనకు దర్శనం ఇచ్చేది. సుందరకాండ శ్రద్ధగా

చదవండి. అంజనేయుడిని మనసారా స్మరించండి. మీ శ్రద్ధా భక్తులు నచ్చిననాడు ఆయనే మీకు ప్రసన్నమౌతాడు. ఈ లోపుగా మీకు తోచినట్లుగా ఊహించుకొని, ఇలా లేనిపోని ఇబ్బందులు కొని తెచ్చుకోకండి ?'

ఆంజనేయుడిని స్మరించడమంటే ఏమిటి ? ఇలా ఒకకోతిని చూస్తూ కూర్చోవడమా ? కాదు. ఆయన జీవిత సన్నివేశాలను స్మరించుకోవడం. ఆయన జీవిత విధానాన్ని స్మరించడం, ఆయనలా జీవితాన్ని నడిపేప్రయత్నాన్ని నిరంతరం చేయడం చేస్తే అది ఆయనను స్మరించడం అవుతుంది. ఇలాంటి స్మరణ జరిగిననాడు, ఆయన మన జీవితంలో ఎలా సాక్షాత్కరించాలన్నది ఆయనే నిర్ణయించుకుంటాడు.' అని చెప్పాను. సరే. ఆ చెప్పింది ఆయనకు నచ్చింది. ఆయన కొంచెం దారిలో పడ్డాడనుకోండి.

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే దానం పేరిట ఇలాంటి వెర్రి మొర్రి వేషాలు వేయకుండా జాగ్రత్తపడాలని. పూజామందిరంలో పెట్టుకునే దేవుని ప్రతిమలు, చిత్రాలు, తైలవర్ణచిత్రాలు కూడా చక్కగా కనులవిందుచేసేవిగా, మనస్సుకు హాయిని కలిగించేవిగా ఉండాలితప్ప వికృతంగాగాని, భయపెట్టేవిగాగాని ఉండకూడదు. ఒక పూజా మందిరంలోనేకాదు. మిగిలిన ఇంట్లోగాని, ఆఫీసులోగాని, ఎక్కడాకూడా వికృతమైన, భయంకరమైన రూపాలు పెట్టుకోకూడదు. పెట్టుకుంటే ఏం జరుగుతుందంటే ఆ రూపాలను చూస్తున్నప్పుడు మన చూపులు, మన ముఖం కూడా మనకు తెలియకుండానే క్రమంగా అలా రూపాంతరం

చెందుతూ ఉంటాయి. రోజూ అలాగే చూస్తున్నామనుకోండి. రూపాంతరం చెందుతూవస్తున్న ఆ ముఖకవళికలు ఇక అలాగే స్థిరపడిపోతాయి.

కావాలంటే మీరు పరీక్షించి చూసుకోవచ్చు. ఒక రాక్షసుడి చిత్రం వేయించి, రోజూ ఒక అరగంటసేపు దానిపై పేచూస్తున్నాడనుకోండి ఒకడు. ఆ రాక్షసుని బొమ్మను అతడు అలా పరిశీలిస్తున్న క్షణాల్లో మీరు అతడి మొహాన్ని పరిశీలించండి. కథ మీకు అర్థమైపోతుంది. అలాగే ఒక శ్రీరామచంద్రుని చిత్రమో, శ్రీ కృష్ణుని చిత్రమో అలా నిలుపెత్తుచిత్రం వేయించి రోజూ ఒక అరగంటసేపు అలాగచూస్తూ కూర్చున్నాడనుకోండి, మరొకడు. అతడలా చూస్తున్నక్షణాల్లో మీరు అతడిని గమనించండి. అతడి ముఖంలో, దేహభాగాల్లో ఎలాంటి ప్రసన్నత, ఎలాంటి తేజస్సు క్రమంగా వ్యక్తమవుతూవస్తూ ఉంటుందో, మీకు ఇట్టే తెలిసిపోతుంది. ఇటువంటివాటినన్నింటినీ దృష్టిలో పెట్టుకునే పెద్దలు 'యద్భావం తద్భవతి' అన్నారు. కనుక మనస్సునకు హాయిని కలిగించే దృశ్యాలూ, చిత్రాలూ చూస్తూ ఉండటం మనస్సుకు హాయినీ, తృప్తినీ కలిగించే దివ్యసందేశాలనూ, గ్రంథాలనూ ఆకళింపుచేసుకొంటూ ఉండటం ఇవన్నీ కూడామనని ఒక ప్రసన్నమైనస్థితిలోనికి తీసుకువెళ్ళి నిలబెడతాయి. అప్పుడా ప్రసన్నత మన మనస్సులలోనేకాదు. ముఖాలలోనూ, దేహభంగిమల్లోనూ కూడా వ్యక్తమవుతూనే ఉంటుంది.

ఒక దుండగీడు ఉన్నాడనుకోండి. వాడివన్నీ దుష్టమైన ఆలోచనలు. వాడుచేసేవన్నీ దుష్టకార్యాలు. అప్పుడు వాడిరూపం ఎలా ఉంటుందో మనకు తెసుసు. అదే ఏ మహనీయుని ప్రేరణ వల్లనో అతని మనస్సు మంచి వైపుకు తిరిగిందనుకోండి. దైవం వైపుకుమళ్ళిందనుకోండి. అన్నివిధాలా ప్రశాంతతనుకోరి అలవరచుకుంటోంది అనుకోండి. క్రమంగా అతడి మనస్సులోనూ దేహంలోనూ ఎలాంటి మార్పులు వస్తాయో మీరే ఊహించండి. కొన్నాళ్ళకి అతడే ఒక ఋషి అయిపోడూ ! అతణ్ణిచూస్తే మనకు దణ్ణంపెట్టాలనిపించదూ ! దుండగీడుగా ఉన్నపుడు అతణ్ణిచూసి మనం భయపడ్డాం. అదే అతడు ఋషిగా రూపొందేటప్పటికి మనమే అతడికి పాదనమస్కారం చేస్తున్నాం. వాల్మీకి కథ అదేగామరి ! భావన మనిషిని ఎలా రూపుదిద్దుతోందో చూడండి. ఆ భావనే మనయొక్క రూపురేఖలుగాకూడా రూపొందుతున్నదని గ్రహించండి. దివ్యమైనభావనతో నవ్యమైన జీవితాన్ని నడపడంలో శ్రద్ధనువహించండి. అప్పుడు మీరూ ఈమానవజాతి చరిత్రలో ఒక వాల్మీకిగా, ఒక దివ్యచరితునిగా నిలిచిపోతారు. తరతరాల మానవుల మనస్సులలో ఒకానొక దివ్యభావనై మెదలగలుగుతారు, మధురిమలను వర్షించగలుగుతారు.

## ఆగని స్మరణ - తోకకు పని

దేవుడికి పూజలుచేయడం దేనికి? మన మనస్సుకి ఒక పద్ధతి రావడానికి. మనస్సుకు పద్ధతిరావడం అంటే ఏమిటి? దేవుడికి తగ్గట్లుగా ఈ మానవ జీవితాన్ని నిర్వహించడం ఎలాగో దానికి చేతకావడం ఆ పద్ధతి తెలియడానికి, అలవడటానికి, ఆ కార్యక్రమ నిర్వహణకు కావలసిన శక్తియుక్తులను దైవం నుండి అందుకోవడానికి మనకు మన పూజలు చక్కగా పనికి వస్తాయి.

అలాకాక, మనకు తోచినట్లు మనం చేస్తూ, మనంచేసిందల్లా ఫలించేటట్లు చూడమని దేవుడికి పెద్దఎత్తున పూజలు, తపాలూ, జపాలూ చేశామనుకోండి. దేవుడందుకు సమ్మతిస్తాడా? మనం చేసిన పూజలు, జపాలు, తపాలు వేసిన దండలు, కొట్టిన కొబ్బరికాయలు, పెట్టిన నైవేద్యాలు తనకీయబడిన లంచంగా స్వీకరించి, దేవుడు మనమడిగిన పనులన్నీ చేసి పెడతాడా? ఏమడగాలో అవి అడిగితే చేసిపెడతాడు. గాని, అడగ కూడనివి అడిగితే చేసిపెట్టకపోగా, తగిన బుద్ధి కూడా చెబుతాడు.

ఒకాయన తన దగ్గర బంధువు మీద అన్యాయంగా కోర్టులో కేసుపెట్టాడు. ఆ కేసును ఎలాగైనా సరే గెలిపించమని రోజూ ఆంజనేయుణ్ణి, తన జప తపాదులద్వారా ఊదర పెట్టసాగాడు. ఇంకా చెప్పాలంటే ఆ ఆంజనేయుడి తోకని మెలి పెట్టసాగాడు. సరే కేసు నడిచింది. నేను ఆంజనేయుడి ఉపా

సకుడిని సుమా! అని అందరికీ తెలిసేటట్లుగా తన రూపు రేఖలను మార్చేసుకుని మరీ ఆయన కోర్టుకు వెళ్ళసాగాడు. క్రింది కోర్టులో గెలిచాడు. ఉబ్బితబ్బిబ్బై ఊగి పోయాడు. 'నేను ఆంజనేయ ఉపాసన చేశాను. అందుకే గెలిచాను. ఆంజనేయుడే నన్ను గెలిపించాడు. మరి నా జపమంటే ఏమిటనుకున్నారు?' అన్నాడు.

ఇంతలో అవతలివాడు హైకోర్టుకు వెళ్ళాడు. మనవాడు మళ్ళీ జపం మొదలుపెట్టాడు. వాయిదా వాయిదాకి హైదరాబాదు వెళ్ళి వస్తున్నాడు. వాయిదాల మీద వాయిదాలు చక్కగా ఆంజనేయుడు తన వాలంతో చుట్టి గుంటూరునుండి హైదరాబాదుకి హైదరాబాదునుండి గుంటూరుకి విసిరివేస్తున్నాడు. ఈ సారి క్రింద కోర్టులో తేలినంత తొందరగా తేలలేదు. మరిన్ని నాళ్ళు తీసుకుంది కేసు. ఆస్తిపాస్తులు కరిగిపోయేదాకా హైకోర్టు చుట్టూ తిప్పింది.

ఎట్టకేలకు తీర్పు వచ్చింది. తీర్పులో మన భక్తుడు చిత్తుగా ఓడిపోయాడు. క్రింది కోర్టు ఖర్చులతో సహా మొత్తం కట్టుకోమన్నారు. భక్తుడికి బుర్ర తిరిగిపోయింది.

ఇదేదో క్రింది కోర్టులోనే ఓడిపోతే సరిపోయేది కదా! అనుకున్నాడు. ఆంజనేయుడు అట్లా ఎందుకు జరగనిస్తాడు. క్రింది కోర్టులో ఓడిపోతే తేలికగా పోదూ! అప్పుడాయన తోకకు పనెట్లా దొరుకుతుంది. అందుకని ముందు క్రింది కోర్టులో గెలిపించాడు. కేసును హైకోర్టుకు పంపించాడు. 'వాలంబునం జుట్టి నేలం బడం గొట్టి'- అన్నట్లుగా గుంటూరునుండి హైదరాబాదుకి హైదరాబాదు నుండి గుంటూరుకి త్రిప్పి త్రిప్పి కొట్టాడు. తోకతో చేయవలసిన

పని పూర్తయిన తరువాత బుద్ధొచ్చిందా? లేదా? అని అడిగి క్రింది కోర్టు ఖర్చులు, పై కోర్టు ఖర్చులూ అసలు మొత్తం - వడ్డీతోసహా కట్టమన్నాడు అవతలివాడికి. భక్తుడింకా అప్పుడు చేయగలిగిందేముంది? ఆంజనేయుడిని స్మరించుకొని, లెంపలు వేసుకుని అంతా కట్టుకున్నాడు. కూడని పనులు చేస్తూ దేవుని సహకారం కోరితే ఇలా ఉండవలసిన పద్ధతిలో ఉంటుందా సహకారం. కనుక మనలో ఎవరికి వాళ్ళు ఎందుకు పూజ చేస్తున్నామో ఆలోచించుకుని మరీ చేయడం మంచిది.

అయితే దేవుడు గట్టివాడు. ధర్మబద్ధంగా మనం నడచుకోవడానికి సిద్ధపడి, పూజలు చేసినప్పుడు మనకు సిద్ధినిస్తాడు. మనం చేస్తున్న కూడని పనులు అయేటట్లుగా చూడమని పూజలు చేసినప్పుడు అందుకు తగిన బుద్ధిని చెబుతాడు. రెండు సందర్భాలలోనూ ఆయన మనకు మంచినే చేస్తున్నాడు పాపం.

## రాక్షసుడు - మనస్సు

పరిగెత్తుతూ పారిపోతున్న మనస్సును పట్టుకొని నడిపించడం ఎలా? ఒక పని మీదినుండి, మరొక పని మీదికి ఎగురుతూ చెదిరిపోతున్న మనస్సును ఒకచోట నిలబెట్టడం ఎలా? ఇవి తరచు మనిషికివచ్చే అనుమానాలు. మనస్సు గురించి మనకు బోధపడ వలసింది చాల ఉంది. అది చాలా శక్తివంతమైనది. కాకపోతే దానిని నడుపుకునే ఒడుపు మనకు తెలియాలి.

ఒక ఉదాహరణ చెబుతాను చూడండి. మనస్సు సంగతేమిటో మనకు చక్కగా బోధపడుతుంది. ఒకాయన ఉన్నాడు. మంచి ఉపాసనాపరుడు. ఆయన ఉపాసన అలా దీక్షగా సాగుతూ ఉండగా, ఒకరోజున అతని కనుల ముందు ఒక భయంకరమైన మూర్తి నిలబడింది. 'నీవెవరవు?' అన్నట్లు చూశాడాయన. 'నే నొక రాక్షస శక్తిని. నీ ఉపాసనకు మెచ్చి, నీకు ప్రసన్న మౌతున్నాను. నీకేం కావాలంటే అది చేసిపెడతాను. కాని నీ వెప్పుడూ నన్ను ఊరికే ఖాళీగా ఉంచకూడదు. ఉంచితే నీకే ప్రమాదం. మరి నాకు చేతినిండా పని చెప్పగలవా?- అన్నాడు రాక్షసుడు 'ఓ' అన్నట్లు చూస్తూ ఆ ఉపాసనాపరుడు ముందు చిన్న చిన్న పనులు చెప్పి చూశాడు. అవీ ఒక పనులేనా? అన్నట్లు చూస్తూ, క్షణమాత్రంలో వాటినన్నిటినీ జరిపించేస్తున్నాడు రాక్షసుడు. ఇక ఇప్పుడేం పనులు చెప్పాలి? తనకు సంబంధించిన పనులు అయిపోయినాయి. ఉపాసనాపరుడికి పిచ్చెక్కినట్లయింది. ఈ చెట్లని అటుమార్చు. ఈ గుట్టలని ఇటు మార్చు అంటూ తనకు తోచినట్లల్లా ఏవేవో చెప్పేస్తున్నాడు. చెబుతుండగానే చేసేస్తున్నాడా రాక్షసుడు. ఆ కొండను ఇటు పెట్టు అన్నాడు. పెట్టేశాడు. ఆ నదిని ఇటు మళ్ళించు అన్నాడు. మళ్ళించేశాడు. ఇక ఆ ఉపాసనాపరుడి కేమీ తోచలేదు. పిచ్చెక్కినట్లయి పోయింది.

ఏమిటేమిటో చాల పనులున్నట్లుగా కనబడేవి పూర్వం. ఇవన్నీ మన మెక్కడ చేయగలం అనిపించేది. దీని దుంపతెగ ఇప్పుడు ఒక్కపనీ కనబడటం లేదేమిటి చేయిద్దామంటే! పూర్వం ఎవరికైనా పని అప్పజెబితే వీడుచేయగలడా? అని ఆలోచించే

వాళ్ళం. ఇప్పుడు ఈ రాక్షసుడు ఎక్కడ చేసేస్తాడోనని భయ పడాల్సి వస్తోంది.' అని ఇలా ఆలోచించుకుంటూనే, ఏవో పనులు ఆ రాక్షసుడికి అలా చెప్తూనే ఉన్నాడు. మరి చెప్పకపోతే ప్రమాదం ముంచుకొస్తుంది. కదా మరి!

వీడి బారి నుండి ఇప్పుడు రక్షింపబడటం ఎలా? అని ఆలో చించసాగాడు. అలా ఆలోచిస్తూకూడా ఏవో పనులు చెబుతూనే ఉన్నాడు ఆ రాక్షసుడికి. చెప్పకపోతే ప్రమాదం కదా, మరి! ఎట్టకేలకు ఒక ఆలోచన వచ్చింది. వెంటనే రాక్షసుడిని పిలిచాడు. ఒక పెద్ద ఇనుపస్తంభాన్ని సృష్టించమన్నాడు. కొన్ని త్రాళ్ళ ప్రమాణంలో ఆ ఇనుపస్తంభం నిలబెట్టబడింది. ఆ పని అయి పోయింది. ఇక ఇప్పుడు ఏం చేయమంటావు అన్నట్లుగా చూశాడు రాక్షసుడు. 'ఆ స్తంభాన్ని ఎక్కు.' అన్నాడు. 'ఇదిగో ఎక్కాను,' అన్నాడు వాడు. 'దిగు' అన్నాడు ఇదిగో దిగాను అన్నాడు వాడు. 'ఇలా ఎక్కుతూ దిగుతూ ఉండు - నేను పిలిచే టంతవరకూ-అన్నాడు. వాడలా ఎక్కుతూ దిగుతూనేఉన్నాడు, ఉపాసనా పరుడు. 'హమ్మయ్య' అనుకున్నాడు. ఇక ఊపిరి పీల్చుకున్నాడు.

మన మనస్సు కూడా అలాంటి రాక్షసుడే. వాడు కూడా మన వైపు అలాగే చూస్తూ ఉంటాడు. అయితే ఆ రాక్షసుడు చెప్పినవల్లా చేశాడు. ఈ మనస్సనే రాక్షసుడున్నాడే వీడు తోచి నవల్లా చేస్తాడు. వీడితోమరీ ఇబ్బంది! తోచిందల్లా చేస్తూ మనకు తోచకుండా చేస్తాడు. ఏం చెప్పాలో తోచక వాడికి పిచ్చెక్కి నట్లయింది. ఇక్కడ మన కథలో ఏం చేయాలో తోచక మనకు పిచ్చెక్కినట్లవుతుంది.

ఈ మనస్సనే రాక్షసుడికి కూడా ఏదో ఒక ఏర్పాటు చేయాలి. వీడు కూడా అలా ఎక్కుతూ దిగుతూ ఉండేట్టు చూడాలి. ఆ ఏర్పాటే మనస్సుకి ఉచ్ఛ్వాస నిశ్వాసాలను గమనించమని చెప్పడం. ఉచ్ఛ్వాసాన్ని గమనిస్తూ అలా పైకి వెళ్ళాలి. నిశ్వాసాన్ని గమనిస్తూ ఇలా క్రిందకు దిగాలి. అలా ఎక్కుతూ దిగుతూ, దిగుతూ ఎక్కుతూ ఉండాలి. ఈ ఏర్పాటునే మన పెద్దలు ప్రాణాయామం అన్నారు. ఇది చేయండి ప్రాణానికి హాయిగా ఉంటుంది. అన్నారు.

ఇలా మనస్సు ఉచ్ఛ్వాస నిశ్వాసల వెంట ఎక్కుతూ దిగుతూ ఉండగా, ఇక మనలో ఏ విధమైన ఒత్తిడులూ ఉండవు. ఉన్నవి ఏమైనా ఉంటే అవన్నీ సడలింపబడతాయి. శరీర కోశాల మధ్య, శరీరంలోని వివిధ ఉపకరణాలమధ్య క్రమంగా ఒక చక్కని శ్రుతి కుదురుతుంది. అవి ఒకదానికొకటి అడ్డు పడకుండా, ఒకదానినొకటి అన గలుపుకుని పనిచేసుకోవడం నేర్చుకుంటాయి. ఇంద్రియాలకూ మనస్సుకూ మనస్సుకీ బుద్ధికీ మధ్య చక్కని అనుసంధాన మేర్పడుతుంది. మనస్సు బుద్ధితో కలసి ఇంద్రియాలను బుద్ధిగా వినియోగించుకోవడం నేర్చుకుంటుంది.

ఆ స్థితిలో చేయదలచినది అన్నది కరిగిపోయి, చేయవలసినది అన్నది చేయబడటం జరుగుతూ ఉంటుంది. దీనినే మన పెద్దలు 'కర్తవ్య నిర్వహణం లేదా స్వధర్మనిర్వహణం' అన్నారు. మామూలుగా అందరూ చేయదలచినది చేస్తూ ఉంటారు. మనస్సును ఉచ్ఛ్వాస నిశ్వాసల వెంట నడుపుతున్న వాడొక్కడే చేయవలసింది చేయగలిగినవాడవుతాడు. ఆ చేయ

వలసినది చేయబడుతున్న క్షణాలలో మనకు అనుభవానికి వచ్చే దివ్య స్థితినే 'మోక్షస్థితి' అన్నారు మన పెద్దలు. కనుక ప్రాణాయామ పరాయణులై ధర్మార్థకామాలను నిర్వహించినవేళ అనుభవానికి వచ్చేటి ఆనందమయ స్థితి ఉన్నదే అది తురీయ పురుషార్థమైన మోక్షం. దానిని అనుభవిస్తూ కర్తవ్యాన్ని నిండుగా నిర్వహిస్తూ జీవితాన్ని ఒక పండుగగా నడిపించడానికే మానవుడికి ఈ శరీరం అందించబడింది.

## జిహ్వాచాపల్యం – జింజరు సోడా

ప్రకృతి తాను మనచేత చేయించదలచిన పనులను చేయించడానికిగాను, చిత్రమైన పద్ధతులను కొన్నింటిని అవలంబిస్తూ ఉంటుంది. శరీరం నిలబడడానికి ఆహారం తీసుకోవాలి. అందుకుగాను మనకు ఆకలి వేసేట్లు చేస్తుంది. ఆహారం తీసుకునేటప్పుడు అది మన నాలుకకు రుచిగా ఉండేటట్లుగాకూడా చూస్తుంది. ఈ రుచి అనేది, ఆహారస్వీకరణ అనేది హాయిగా, సజావుగా జరగడానికిగానూ ప్రకృతిచేసిన ఒక చక్కని ఏర్పాటు అని మనం గమనించుకోవాలి. అందుకొరకే అంతవరకేదాన్ని అనుభవించడం అన్నదికూడా మనంనేర్చుకోవాలి. అలాగాక, ఆ రుచిని చూడటంలో రుచిని మరిగి, అదే పనిగా తినడానికి అలవాటుపడ్డాం అనుకోండి, అది ప్రకృతియెడల అపచారమవుతుంది. మన దేహానికి అనారోగ్యమనే ముప్పువాటిల్లుతుంది.

ఒకప్పుడు ఒక ప్రొఫెసరుగారుండేవారు. ఆయనకు గారె లంటే ఇష్టం. ఆరోజు వాళ్ళింట్లో తద్దినమనుకుంటాను. మనవైపు తద్దినం గారెలకు పెట్టిందిపేరుగదా ? పోయినవారి కొరకుచేసే ఆ క్రతువును ఆయన తనకొరకుగా భావించి, అదే పనిగా గారెలుతినీ తినీ భుక్తాయాసంతో రొజుకుంటూ డిపార్టు మెంటుకువచ్చి, ఆపసోపాలుపడుతున్నాడు. అంతటితో ఆగలేక కడుపునొప్పి వస్తోందంటూ మెలికలు తిరుగుతున్నాడు.

ఈ బాధనంతా చూస్తున్న ఒకానొక సహోద్యోగి "కాస్త జింజరు తెప్పించుకొని, సోడాతో కలుపుకొని త్రాగండి. ఆ జింజరు సోడావలన కడుపునొప్పి తగ్గిపోతుంది." అన్నాడు.

ఆ ప్రొఫెసరుగారు ఆశ్చర్యంగా చూస్తూ, 'నిజంగా తగ్గి పోతుందా ? గ్యారంటీయేనా ? అని అడిగాడు.

'ఓ. గ్యారంటీగా తగ్గిపోతుంది'— అంటూ అభయం పట్టాడు ఆ సహోద్యోగి.

ప్రొఫెసరుగారి ముఖంలో ఆశ్చర్యం స్థానంలో క్రొత్త వెలుగు ఏదో వెలిగింది. వెంటనే ఆయన డిపార్టుమెంటుప్యూనును పిలిచి, 'ఏమోయ్ ! ఈ డబ్బులుతీసుకో. ఒక జింజరుసోడా, నాలుగుగారెలూ తెచ్చిపెట్టు.— అన్నాడు.

ఆశ్చర్యపడటం ఇప్పుడు ఆ సహోద్యోగివంతయింది. అది గమనించిన ప్రొఫెసరుగారు, 'మీరెలాగూ తగ్గిపోతుందని గ్యారంటీ ఇస్తున్నారుకదా ! మీ మాట' మీద నాకు నమ్మకం కలిగింది. అందుకని మరో నాలుగు గారెలుతిని మరీ ఆ జింజరు సోడా త్రాగుదామనుకుంటున్నాను. ఏమంటారు ? అన్నాడు.

ఏమంటాడు ? ప్రొఫెసరుగారికి, గారెకి మరీ ఇంత అనుబంధమా ?' అని తట్టుకోలేక తలక్రిందులై పోయాడు ఆ సహోద్యోగి.

చూశారా ! జిహ్వాచాపల్యవిలాసం. ఆయన చదువుకున్నవాడే. పదిమందికి చెప్పే ప్రొఫెసరే ! అయినా తన మనస్సుకు తాను నచ్చచెప్పలేకపోయాడు. ఆహారానికి రుచి అన్నది ఎందుకు ఏర్పాటుచేయబడిందో గ్రహించుకోలేకపోయాడు. గ్రహించినా నిగ్రహించుకోలేకపోయాడు. ఆహారమేకాదు పానీయం విషయం అయినా అంతే ! దాంపత్యం విషయమైనా అంతే. ప్రకృతి మన చేత చేయిస్తున్న పనులన్నింటి విషయంలోనూ మనంగమనించుకోవలసింది ఇదే. పని జరగడానికిగానూ ఆ పనిలో ఒక రుచికి ఏర్పాటుచేస్తున్నది ప్రకృతి. రుచిని అనుభవించడానికిగాను మనమా పనిని నియమాలను అతిక్రమించిచేయడం ప్రకృతికి విరుద్ధమవుతుంది. అప్పుడు దానికితగిన శిక్షను మనం అనుభవించవలసివస్తుంది. ప్రకృతి మనకు తల్లి . ఆమె ఎప్పుడూ మనలను ముద్దుగా చూసుకోవాలనే అనుకుంటుంది. కాకపోతే ఆ ముద్దును దక్కించుకోవడం మనకే చేతకావాలి.

# వెతికే మనిషికి పెద్ద ప్రశ్న

మన శరీరం నిలబడడానికి ఏవి అవసరమో, వాటిని మాత్రమే మనకు రుచిగా ఉండేటట్లుగా ఏర్పాటుచేసింది ప్రకృతి. మిగిలినవి ఒకవేళ మనకుదగ్గరైనా, వాటిని మననాలుక వద్దుపొమ్మంటుంది. ఏవి శరీరానికి పనికిరావో, ఏవి శరీరాన్ని పాడుచేస్తాయో, అవి మనకు రుచిగాలేకుండా ఉండేటట్లుగా రూపొందించడంలో జాగ్రత్తవహించింది ప్రకృతి.

కానీ మనిషి చిత్రమైనవాడు. రుచిగాలేని వాటినికూడా చేరదీసి, వాటితో స్నేహంచేసి, తన నాలుక క్రమంగా వాటికి అలవాటు పడేటట్లుగాచేసి, ఆ రుచిగానిరుచినే మనస్సు మరల మరల కోరేట్లుగా చేయగలడు. ఇలా తనను తాను కావాలని చెడగొట్టుకోగలడు.

కాఫీ సంగతి ఏమిటి? టీ సంగతి ఏమిటి? కల్లూ, సారాయి మొదలైన మత్తుపానీయాల సంగతి ఏమిటి? వక్క పొడి, ధూమపానం, కారాకిళ్ళీల సంగతి ఏమిటి? ఇవన్నీ విష ప్రాయాలేకదా! అయినా మనస్సు వీటిని మచ్చికచేసుకుని, వీటినుండి రుచికాని రుచిని అనుభవించాలని చూస్తున్నది, క్రమంగా వీటి ఎడలరుచిమరుగుతున్నది. అందుకుగాను మనిషి తన ఆరోగ్యాన్ని, చివరకు తన శరీరాన్నికూడా మూల్యంగా చెల్లించవలసి వస్తుంది. అందుకే మన పెద్దలు ఇలాంటికూడని అలవాట్లను వ్యసనాలు అన్నారు.

'వ్యసనం' అన్న పదానికి దుఃఖం అని అర్థం. ఈ వ్యసనాలద్వారా కాని సుఖాన్ని ఏదో అనుభవించబోయి, లేని దుఃఖాన్ని కొని తెచ్చుకుంటున్నాడు మనిషి—అన్నది పెద్దల అభిప్రాయం.

రుచిగా ఉన్నాయికదా అని, ఆహారపానీయాలను మరి కొంచెం తీసుకున్నా మనిషికి దుఃఖమే కలుగుతున్నది. రుచిగా లేనివాటియెడల, రుచిని కలిగించుకొని రుచిని మరిగినా, మనిషికి దుఃఖమే మిగులుతుంది. ఇంతకూ మనిషికిగల సుఖాభిలాష మనిషిచేత ఇలాంటిపనులన్నింటినీ చేయిస్తున్నది. నిజానికతడికి తానింతగా కోరుకొంటున్న ఇంతగా వెతుకులాడుతున్న ఆ సుఖమంటే ఏమిటో అసలు తెలుసునా ? ఇది ఒక పెద్ద ప్రశ్న.

## ఎవరూ మనలను సుఖపెట్టేది

'ఇంత జీవితం గడిచింది. సుఖపడిన క్షణాలుమాత్రం కనబడటంలేదు. ఉండటానికి ఇంతమందిఉన్నారు. కాని సుఖ పెట్టిన వాళ్ళు మాత్రం ఎవ్వరూ లేరు. ఇలాంటి జీవితం ఎందుకో నాకే అర్థంకావడంలేదు.—అంటూ అదే పనిగా బాధపడిపోయే వారుంటారు. సుఖం దానంతట అది రావాలనీ, లేదా ఎవరైనా సుఖపెట్టాలని వీరిభావం. అదెలా సాధ్యం ! అది మాత్రం వీళ్ళు ఆలోచించరు.

సుఖపడటం చేతకానివాడినిగాని, సుఖపడటానికి ఇష్ట పడనివాడినికాని ఈ లోకంలో ఎవ్వరూసుఖపెట్టలేరు. సుఖపడటం చేతకానివానికి సుఖపడే అవకాశాలు జీవితంలో ఎన్నివచ్చినా, వాటినన్నింటినీ చేతులారా చెడగొట్టుకొని కూర్చుంటాడు. సుఖ పడటానికి ఇష్టపడనివాడిని, చుట్టూఉన్నవాళ్ళు సుఖపెడదామని ఎంత ప్రయత్నించినా, తాను ఏ మాత్రం సుఖపడకుండా, జాగ్రత్త పడుతుంటాడు. పైకిమాత్రం వీరిద్దరూ కూడా మాకు సుఖం ఏదీ ? మాకు సుఖం ఏదీ అంటూ ఉంటారు. చేతకానివాడు నేర్చుకోవచ్చుకదా ! నేర్చుకోడు. కాని వాడికి సుఖంకావాలి. ఇష్ట పడనివాడు తన మనస్సును సరిచేసుకుని ఇష్టపడవచ్చుకదా ! ఆ సరిచేసుకోవడానికి వాడికి ఇష్టం ఉండదు. కానీ, వాడికీ సుఖం కావాలి.

నిజానికి చుట్టూవున్నవాళ్ళు మనని సుఖపెట్టగలరా? సుఖ పెట్టలేరు. ఈ సత్యం తెలిస్తే మనకు ఆశ్చర్యం వేస్తుంది. మనకు సుఖపడటం చేతనైతే, ఆ చుట్టూ ఉన్నవాళ్ళు అవకాశా లను కల్పించడం ద్వారా, దోహదం చేయగలరు, కాని వాళ్ళు సుఖపెట్టలేరు. మనం సుఖపడటానికి ఇష్టపడితే ఆ చుట్టూ ఉన్న వాళ్ళు, మన ఇష్టానికి తగినట్లుగా సహకరించగలరు. కానీ, వాళ్ళు మనని సుఖపెట్టలేరు.

సుఖపడటం చేతకానివాడికి అవకాశాలు వచ్చాయనుకోండి. బాబోయ్. ఈ పనులు, ఈ బాధ్యతలు, ఈ సమస్యలు అంటూ బెంబేలు పడిపోతాడు. సుఖపడటానికి ఇష్టపడని వాడిని ఏ కొడుకో తీసుకువెళ్ళి బంగారు పూలతో పూజ చేశాడనుకోండి. ఇదంతా

ఏదో మోసంగా ఉందే! అనుకుంటాడు. హార్లిక్స్‌లూ మొదలైనవి తెచ్చి ఇచ్చారనుకోండి. ఇవన్నీ తన ఆస్తిని కొట్టేయడానికి వేస్తున్న ఎత్తుగడలు అనుకుంటాడు. ఇంకా కొంచెం కుసంస్కారి అయితే ఇందులో ఏమైనా కలిపారేమో! ఎవరు చెప్పగలరు? అంటాడు. మరెట్లా వాడిని సుఖపెట్టడం. ఏం చేసి సుఖపెట్టగలరు వీడిని?

మరి. ఇలాంటప్పుడు సుఖపడిన క్షణాలు లేవనీ, సుఖపెట్టిన వారే లేరనీ, అనుకుంటూ విలవిలలాడడంలో అర్థం ఉన్నదా? ఔచిత్యమున్నదా? ఆలోచించ వలసిన అంశమిది.

## వెనుకకు మరలిన వేళ

ఇలా సుఖాభిలాషలో మానవుడు రకరకాలైన ప్రయత్నాలు చేస్తున్నాడు. అన్నపానీయాలను, మైథునాది క్రియలనూ హద్దులు దాటి అనుభవించి చూద్దామని అనుకుంటున్నాడు. వ్యసనాలకు లోబడి ఆ సుఖాన్ని వాటిలో వెతికి పట్టుకుందామనుకుంటున్నాడు. ఈ రెండు ప్రయత్నాలలోనూ అతడు తన ఆరోగ్యానికి, శరీరానికి ముప్పు తెచ్చుకుంటున్నాడు. శరీరాన్ని పెట్టుబడిగా పెట్టి సుఖాన్ని అనుభవిద్దామని చూసినప్పుడల్లా సుఖం దొరకటం మాట అటుంచి, శరీరం దెబ్బతినిపోవడం జరుగుతున్నది.

మరికొందరు మనస్సును రకరకాలుగా పరిగెత్తించి, సుఖాన్ని పొందాలని చూస్తున్నారు. కొడుకులవెంటా, కూతుళ్ళ

సుఖపడటం చేతకానివాడినిగాని, సుఖపడటానికి ఇష్ట పడనివాడినికాని ఈ లోకంలో ఎవ్వరూసుఖపెట్టలేరు. సుఖపడటం చేతకానివానికి సుఖపడే అవకాశాలు జీవితంలో ఎన్నివచ్చినా, వాటినన్నింటినీ చేతులారా చెడగొట్టుకొని కూర్చుంటాడు. సుఖ పడటానికి ఇష్టపడనివాడిని, చుట్టూఉన్నవాళ్ళు సుఖపెడదామని ఎంత ప్రయత్నించినా, తాను ఏ మాత్రం సుఖపడకుండా, జాగ్రత్త పడుతుంటాడు. పైకిమాత్రం వీరిద్దరూ కూడా మాకు సుఖం ఏదీ ? మాకు సుఖం ఏదీ అంటూ ఉంటారు. చేతకానివాడు నేర్చుకోవచ్చుకదా ! నేర్చుకోడు. కాని వాడికి సుఖంకావాలి. ఇష్ట పడనివాడు తన మనస్సును సరిచేసుకుని ఇష్టపడవచ్చుకదా ! ఆ సరిచేసుకోవడానికి వాడికి ఇష్టం ఉండదు. కానీ, వాడికీ సుఖం కావాలి.

నిజానికి చుట్టూవున్నవాళ్ళు మనని సుఖపెట్టగలరా? సుఖ పెట్టలేరు. ఈ సత్యం తెలిస్తే మనకు ఆశ్చర్యం వేస్తుంది. మనకు సుఖపడటం చేతనైతే, ఆ చుట్టూ ఉన్నవాళ్ళు అవకాశా లను కల్పించడం ద్వారా, దోహదం చేయగలరు, కాని వాళ్ళు సుఖపెట్టలేరు. మనం సుఖపడటానికి ఇష్టపడితే ఆ చుట్టూ ఉన్న వాళ్ళు, మన ఇష్టానికి తగినట్లుగా సహకరించగలరు. కానీ, వాళ్ళు మనని సుఖపెట్టలేరు.

సుఖపడటం చేతకానివాడికి అవకాశాలు వచ్చాయనుకోండి. బాబోయ్. ఈ పనులు, ఈ బాధ్యతలు, ఈ సమస్యలు అంటూ బెంబేలు పడిపోతాడు. సుఖపడటానికి ఇష్టపడని వాడిని ఏ కొడుకో తీసుకువెళ్ళి బంగారు పూలతో పూజ చేశాడనుకోండి. ఇదంతా

ఏదో మోసంగా ఉందే! అనుకుంటాడు. హార్లిక్స్‌లాంటి మొదలైనవి తెచ్చి ఇచ్చారనుకోండి. ఇవన్నీ తన ఆస్తిని కొట్టేయడానికి వేస్తున్న ఎత్తుగడలు అనుకుంటాడు. ఇంకా కొంచెం కుసంస్కారి అయితే ఇందులో ఏమైనా కలిపారేమో! ఎవరు చెప్పగలరు? అంటాడు. మరెట్లా వాడిని సుఖపెట్టడం. ఏం చేసి సుఖపెట్టగలరు వీడిని?

మరి. ఇలాంటప్పుడు సుఖపడిన క్షణాలు లేవనీ, సుఖపెట్టిన వారే లేరనీ, అనుకుంటూ విలవిలలాడడంలో అర్థం ఉన్నదా? ఔచిత్యమున్నదా? ఆలోచించ వలసిన అంశమిది.

## వెనుకకు మరలిన వేళ

ఇలా సుఖాభిలాషలో మానవుడు రకరకాలైన ప్రయత్నాలు చేస్తున్నాడు. అన్నపానీయాలను, మైథునాది క్రియలనూ హద్దులు దాటి అనుభవించి చూద్దామని అనుకుంటున్నాడు. వ్యసనాలకు లోబడి ఆ సుఖాన్ని వాటిలో వెతికి పట్టుకుందామనుకుంటున్నాడు. ఈ రెండు ప్రయత్నాలలోనూ అతడు తన ఆరోగ్యానికి, శరీరానికి ముప్పు తెచ్చుకుంటున్నాడు. శరీరాన్ని పెట్టుబడిగా పెట్టి సుఖాన్ని అనుభవిద్దామని చూసినప్పుడల్లా సుఖం దొరకటం మాట అటుంచి, శరీరం దెబ్బతినిపోవడం జరుగుతున్నది.

మరికొందరు మనస్సును రకరకాలుగా పరిగెత్తించి, సుఖాన్ని పొందాలని చూస్తున్నారు. కొడుకులవెంటా, కూతుళ్ళ

వెంటా, హోదాలవెంటా, అంతస్తులవెంటా, ధనధాన్యాదులవెంటా పరిగెత్తి పరిగెత్తి ఆ మనస్సు అలసిపోతూ ఉండగా. అయ్యో! జీవితంలో సుఖం ఏదీ? అంటున్నారు. మనసుతో సుఖాన్ని బయట వెతికే ప్రయత్నం చేస్తున్నారు. అలసిపోతున్నారు. జీవిత ప్రయాణంలో అలసిపోయాం అని నిట్టూర్పులు విడుస్తు న్నారు. మరి సుఖమేది? పాపం అదే వారికి అంతుపట్టడంలేదు.

మనస్సు ప్రేరణతో శరీరాన్ని బలిచేసినా సుఖం దొరకటంలేదు. పోనీ మనస్సునే పరిపరివిధాలుగా పరిగెత్తించి, వెతికించినా, సుఖం దొరకటం లేదు. మరి ఎలా సుఖపడేది?

ఇక్కడొక సత్యాన్ని గమనించాలి. దీపంతో మనం అన్ని వస్తువులనీ చూడగలం. కానీ ఆ వస్తువులలో ఏ వస్తువుతోనూ మనం దీపాన్ని చూడలేం. ఆ వస్తువు చూపలేదు. సుఖం ఆ దీపం లాంటిది. సుఖస్థితిలో మనం సకల వస్తువులను స్పృశించి సుఖ పడవచ్చును. కానీ, ఆ వస్తువులలో ఏ వస్తువూ మనకు సుఖాన్ని అందించలేదు. దీపం వస్తువుని చూపగలదు. అ వస్తువునుకూడా తన వెలుగులో ఉంచగలదు. ముంచగలదు. కాని మరి ఏ వస్తువూ ఆ దీపమును చూపలేదు.

బాగున్నది. మరి ఆ దీపంలాంటి సుఖం ఎక్కడ ఉన్నది? అది బయటలేదు. మనలోనే ఉన్నది! మన స్వరూపమై ఉన్నది. అది మన స్వరూపమై ఉన్నప్పుడు మన మనస్సుకు మరి ఎందుకని అందటంలేదు. మన మనస్సు బయటకు పరుగులెత్తుతూ ఉన్నదిగాని, లోపలివైపుకు చూడటం లేదుకదా! ముందుకు పరిగెత్తటం మాని, వెనుకకు చూడగలిగితే

ఆ సుఖస్వరూపం, ఆ నిజస్వరూపం తప్పక కనబడుతుంది. మనస్సు అలా వెనుకకు చూసేటందుకు చేసే ప్రయత్నాన్నే అంతర్ముఖం చెందడం అంటారు.

వెనుకకు తిరిగిన మనస్సు బుద్ధిని సమీపిస్తుంది. మనస్సుకు బుద్ధితో అనుసంధానం ఏర్పడుతుంది. ఆ అనుసంధానం నుండి వివేకమనే ఒక వెలుగు వెలుగుతుంది. ఆ వెలుగులో మనస్సుకు తన మూలమేమిటో దర్శనమిస్తుంది. మనదైన ఆ నిజ స్వరూపంలో ఆ మనస్సు అప్పుడు కరిగిపోతుంది. ఒదిగి పోతుంది.

జరుగ వలసిన ఈ ప్రయాణాన్ని వర్ణిస్తూనే భగవద్గీతలో శ్రీకృష్ణుడు 'మానవుని శరీరంలో మిగిలిన భాగాలకన్నా, ఇంద్రియాలు చైతన్య వంతమైనవి. ఇంద్రియాలకన్నా, ఆ ఇంద్రియాలను నడిపే మనస్సు ఇంకా చైతన్యవంతమైనది. మనస్సుకన్నా ఆ మనస్సుకు మంచి చెడులు చెప్పగల బుద్ధి ఇంకా చైతన్యవంతమైనది. అలాంటి బుద్ధిఎక్కడినుండి వ్యక్తమవుతూ ఉన్నదో, అతడు ఆ పైన ఉన్నాడు.' అని చెబుతాడు. జరుగవలసిన ఈ ప్రయాణాన్ని సూచిస్తూనే 'రిట్రీట్, ది కింగ్ డమ్ ఆఫ్ హెవెన్ ఈస్ దైన్' (Retreat the kingdom of heaven is thine) అంటాడు. ఏసుప్రభువు బైబిల్‌లో, 'వెనుకకు మరలుడు. స్వర్గరాజ్యము అలా మరలినవారిదే సుమా!' అని ఈ వాక్యానికి అర్థం. అనువాదకులు తెలియక ఇక్కడ 'రిట్రీట్' అని ఉండటానికి బదులుగా 'రిపెంట్' అని

అనువాదం చేసుకున్నారు. పశ్చాత్తాప పడండి. పశ్చాత్తాప పడిన వారిదే స్వర్గరాజ్యం. అని వ్రాసుకున్నారు. అలా వ్రాసుకున్నందుకు వారు పశ్చాత్తాప పడక తప్పదు. ఇలాంటి చేతగాని వ్రాతలవల్ల బైబిల్ యొక్క మూలస్వరూపమే దాదాపుగా మారిపోయిందని చెప్పవచ్చు.

వెనుకకు మరలి, బుద్ధితో కూడుకొని, మన నిజస్వరూపంలోనికి ఒదిగిపోయిన మనస్సుకు ఎనలేని శాంతి అనుభవానికి వస్తుంది. మనస్సు మన నిజస్వరూపంలోనికి ఒదిగిపోతున్న వేళ, కరిగిపోతున్న వేళ ఆ మనస్సుకు అనుభవానికి వచ్చే దివ్యస్థితినే 'శాంతి' అంటారు.

అలాంటి శాంతిని అనుభవిస్తున్న మనస్సు 'ఇంద్రియాలతో ఇలా అంటుంది.' ఇకపైన మిమ్మల్ని వినియోగిస్తాను తప్ప, పరిగెత్తించను. నాతో మిమ్మల్ని నడిపించుకుంటాను తప్ప, మీ ద్వారా నేను బెదిరిపోను. నాకు తెలుసు, నేను బెదిరిపోతున్న క్షణాలలో మీరు బెదిరిపోతూ ఉంటారని. నేనిప్పుడు పరిపూర్ణమైన శాంతిని అనుభవిస్తున్నాను. ఈ శాంతిలోనుండే మిమ్మల్ని నడిపిస్తూ, దైవం నాకప్పగించిన ఈ జీవిత కార్యాన్ని నిర్వహిస్తాను. కార్యనిర్వహణ జరుగుతున్న వేళలో ఇప్పటినుండి మనకు ఒక చక్కటి హాయి అనుభవానికి వస్తుంది. ఆ హాయినే పెద్దలు సుఖం అన్నారని నాకు తెలిసింది. నాకు అటు శాంతి, ఇటు సుఖం – ఇలా సుఖ శాంతులు చెట్టాపట్టాలు కట్టుకొని, జీవితకార్యాన్ని నడిపిస్తూ ఉంటే ఎంతబాగుంటుంది. దీనినే పెద్దలు 'జీవన్ముక్త స్థితి' అన్నారు. అంటూ అంతవరకు

అలసిపోయిన ఇంద్రియాలను, అంతు దొరికిన ఆ మనస్సు అలా సేదదీరుస్తూ ఉంటే, ఆ ఘట్టం ఎంతబాగుంటుందో ఒక్క సారి చూడండి. ఇలాంటి ఘట్టం మన అందరి జీవితాలలోనూ రూపుకట్టుకోవాలని కోరుకుందాం.

సుఖశాంతులను అనుభవించగలగడం అనేది ఒక కళ. ఆ కళకే కౌశలం అని పేరు పెడుతూ శ్రీకృష్ణుడు 'యోగః కర్మసు కౌశలం' అన్నాడు. ఆ కళలో పట్టుచిక్కేట్లు చేయడానికి గాను పెద్దలచేత మనకందించబడిందే రాజయోగసాధనా విధానం.

## మారింది ఎవరు ?

## రోజులా - మనమా ?

రోజులు బాగుండలేదు అంటారు. కాలం మారిపోయింది అంటారు. ఇవి ఇదివరకటిరోజులుకావు అంటారు. ఇంకా ఈ రోజుల్లో మనంచేయగల్గింది ఏమిటి ? అంటారు. కాలంతోపాటు మనమూపోవాలి అంటారు నలుగురితోపాటు మనమూ రాజీపడి పోవాలిఅంటారు. మనం ఒక్కళ్ళం చేస్తేఅవుతుందా ? ఉంటే అవుతుందా ?'— అంటూ నిట్టూర్పులు విడుస్తూ ఉంటారు.

కొంచెంనిదానించి చూస్తేమారిందిరోజులా ! లేక మనమా ? అన్న ఆలోచన మనలో తప్పకుండా కలుగుతుంది. సూర్యుడూ, చంద్రుడూ మామూలుగానే ఉన్నారు. గ్రహాలన్నీ గతులుతప్ప

కుండా యథాప్రకారం తిరుగుతున్నాయి. రోజులూ, మాసాలు, ఋతువులు అన్నీ మామూలుగానే నడిచిపోతున్నాయి. కాల గతిలో మార్పెక్కడ ? ఆ వచ్చిన మార్పేదో మన మనస్తత్వాల్లో వస్తున్నది. మనజీవన విధానాల్లో వస్తున్నది. మనిషిచేస్తున్న ప్రయోగాలవల్ల, సాధిస్తున్న ఫలితాలవల్ల వస్తున్నది. మనిషి తాను మారిపోతూ, కాలాన్ని నిందించటం ఏమన్నా బాగుందా ?

మార్పులు వస్తున్నాయి. ఆహ్వానించు. ఆ మార్పుల్లో మంచి వాటిని స్వీకరించు, గతమున్నది, గౌరవించు. ఆ గత మందించిన మంచి అంశాలను పోకుండా పొదివిపట్టుకోవడం నేర్చుకో. వివేకవంతుడవై మెలగడం నేర్చుకో. పాత క్రొత్తల మేలు కలయికను సాధించుకో. ఒకసారి ఇది మంచిది అని గ్రహించిన తరువాత దానినిక వదలకు. వదిలివేయుటం నీలో శ్రద్ధలేకపోవడాన్ని సూచిస్తుంది. సాధనలేనితనాన్ని తెలియ జేస్తుంది అని గ్రహించు. ఆతప్పును కాలంమీదతో సేసి, కాలమిలా ఉందని మనని మనం సమాధానపరచుకోవడానికి ప్రయత్నించ చడం — అది సరిపెట్టుకోవడం అవుతుంది. ఇంకా చెప్పాలంటే అది ఆత్మవంచన అవుతుంది.

లోకం పోకడనుబట్టి మనమూ పోవాలికదా ! అని నీవు అనవచ్చు. నేనంటాను— మన పోకడే సరియైనదని ఋజువైతే, లోకమే మనవెంట వస్తుందికదా ! అని. ఇది మంచిదీ అని తెలిసిన తరువాత ఇక రాజీపడకు, ఇది చేయవలసింది అని తెలి సిన తరువాత ఇక అశ్రద్ధచేయకు. ఇది కర్తవ్యం అని బోధ పడిన తరువాత ఇక బద్ధకించకు.

ఉద్యోగంలో చేరినంత మాత్రాన సంధ్యావందనం మానేయాలని ఉన్నదా? ఆధునిక విద్యను అభ్యసించినంతమాత్రాన వేదాధ్యయనాన్ని వదులుకోవాలని ఉన్నదా? పొట్టపట్టుకుని బస్తీలకుచేరినంతమాత్రాన సదాచారాన్ని కోల్పోవాలనిఉన్నదా? జీవనవిధానంలో కొన్ని మార్పులు తప్పనిసరైనంత మాత్రాన మనం మనంగా బ్రతకడం మానివేయాలని ఉన్నదా? మార్పులు వచ్చినంత మాత్రాన మనని మనం మరచిపోవడమేనా? మార్పులు వచ్చినంత మాత్రాన మనదైన పద్ధతిని మనం కోల్పోవడమేనా? అలామరచిపోయి, కోల్పోయి, జీవచ్ఛవాలుగా మిగిలిపోతున్నాముకదా! ఇదేనామనం సాధించదలచుకున్నది. వేగం పెరుగుతున్న జీవితంలో నిరంతరం తాపత్రయంతో అశ్రులు జాస్తూ జీవిస్తున్నది ఇందుకేనా? ఈ స్థితిని పొందడానికేనా?

భారతీయుని ఈ పతనావస్థకు కారణం కాలమూకాదు. ప్రపంచ పరిస్థితులుకాదు. విచక్షణాజ్ఞానం అతనిలో లోపించడం, శ్రద్ధ అనేది అతడిలో లేకపోవడం. శ్రమపడటానికి అతడు ఇష్టపడకపోవడం. 'ఎలాగో అలా పొట్టపోసుకోగలిగితేచాలు.' అన్న స్థాయికి అతడు దిగజారిపోవడం—ఇవీ ప్రధాన కారణాలు.

ఒక ఐన్‌స్టీన్‌ను చూడండి. అతడు తనకున్న విచక్షణను వినియోగించి, ప్రాక్— పశ్చిమాలను సమన్వయించుకొని, ఒక మంచి శాస్త్రవేత్త కాగలిగాడు. ఇటు తత్త్వజ్ఞానపుల్లోతులు చూస్తూనే, అటుసృష్టి నిర్వహణలోని వ్యూహాలను దర్శించగలిగాడు. అలాంటి సమన్వయదృష్టి, సమగ్రమైన అవగాహన మనకిప్పుడుకావాలి. సకలదేశ సంస్కృతీ నాగరికతలు మనను

చుట్టుముట్టుతున్న వేళ మనలోని విచక్షణ అలా పనిచేయాలి. వాటిలో ఉన్న మంచిని మనం స్వీకరించాలిగాని, వాటన్నింటి ప్రభావం మాత్రం మనమీద పడకూడదు.

నాకు తెలిసిన ఒకరైల్వే ఉద్యోగి ఉన్నాడు. ముప్ఫయి ఏళ్ళపాటు ఉద్యోగరీత్యా రైళ్ళలో తిరుగుతూనే ఉన్నాడు. కాని, ఒక్కనాడుకూడా బయట మంచినీళ్ళు త్రాగలేదు. మంచి నీళ్ళుతనతోపాటు ఇంటిదగ్గరనుండే పట్టుకొని వెళ్ళేవాడు. అవే త్రాగేవాడు. మాటిమాటికీ నీళ్ళుమారడంవల్ల, ఎక్కడబడితే అక్కడ నీళ్ళు త్రాగడంవల్ల ఆరోగ్యానికి ముప్పు ఉందని గ్రహించిన అతడు ఉద్యోగం చేసినంతకాలం ఈ నియమాన్ని పాటించాడు. శ్రద్ధఅంటే ఇలా ఉండాలి. శ్రద్ధఉన్నవాడు పరిస్థితులూ, పరిసరాలుఎలాంటివైనా తాననుకున్నది సాధించుకోగలుగుతాడు. ఇలా ఉండటం మంచి పద్ధతి అని మనకు తెలిసినప్పుడు దానిమీద ఇలాంటి శ్రద్ధపెట్టగలగడం మనకుచేతకావాలి.

గాంధీమహాత్ముడు తానెన్ని పనులలోఉన్నా, మానసికంగా ఎన్ని అంశాలగురించి ఆలోచిస్తున్నా, శరీరానికి ఒకవైపు పని అప్పజెపుతూనే ఉండేవాడు. సమస్త వ్యవహారాలూ ఒకవైపు మాట్లాడుతూనే ఉండేవాడు. మరొకవైపు రాట్నాన్ని త్రిప్పుతూ, దారాన్ని ఒడుకుతూ ఉండేవాడు. ఆశ్రమంలో పశువులపోషణ స్వయంగాచూసేవాడు. రోగార్తుల సేవను సాధ్యమైనంతవరకు తానుగా చేయడానికే ప్రయత్నించేవాడు. చేయవలసింది చేస్తున్నామా ? లేదా ? అన్న ప్రశ్నతప్ప, ఆ పనులయొక్క ఉచ్చనీచాల ప్రసక్తి అక్కడలేదు. అలా తానుఒళ్ళువంచి పనిచేస్తూ,

ఆశ్రమవాసులందరిచేత అలాగే చేయించేవాడు. శారీరకమైన శ్రమను సమర్పణబుద్ధితో ఎలా చేయాలో, మనం మహాత్ముడి దగ్గర నేర్చుకోవలసిందే! శారీరకమైన శ్రమ తగినంతగా చేయ డమన్నది జరిగినప్పుడే మన మనస్సుకూడా సమతూకంలోనికి వస్తుంది. 'మెంటల్ బాలెన్స్' నిలబడాలిఅంటే ఒంటికి తగు మాత్రం పని చెప్పాలి. ఈ సత్యాన్ని మనం గమనించుకోవాలి.

ఇక పొట్టపోసుకోవడమే జీవితగమ్యంగా గోచరించడం; అన్నదాని దగ్గరకువద్దాం. పొట్టపోసుకోవడమే గమ్యమైనప్పుడు మనం జంతువులకంటే పతనమైపోతున్నాం. ఆహారం స్వీకరిం చడం, నిద్రపోవడం, పరిస్థితులు తారుమారుగా గోచరించి నప్పుడు భయపడటం, దాంపత్యసుఖాన్ని అనుభవించడం అన్ని జంతువులకూ సమానధర్మాలు. నరుడుకూడా జంతువేకాబట్టి నరుడికికూడా ఇవి వర్తిస్తాయి. అయితే జంతువులలో నరజన్మ దుర్లభమని చెప్పబడింది. మిగిలిన జంతువులకు లేని స్వేచ్ఛ నరులకు ఈయబడింది. జంతువులకు స్వేచ్ఛలేదు. ప్రకృతి నియమాలకులోబడి జీవిస్తాయి అవి. ఆకలివేస్తేనేతినగలవు. వేసి నంత వరకే తినగలవు. నిద్రవచ్చినప్పుడే పడుకోగలవు. పట్టి నంతవరకే పడుకోగలవు. ప్రాణవిపత్కర పరిస్థితుల్లో మాత్రమే వాటికి భయం వేస్తుంది. ఆ పరిస్థితులున్నంతవరకే వేస్తుంది. ఋతుకాలంలో మాత్రమే వాటికి దాంపత్యాభిలాషకలుగుతుంది. మిగిలినప్పుడు ఆ ప్రసక్తే ఉండదు. తనకు స్వేచ్ఛలభించిన కారణాన మానవుడు వీటి అన్నింటిలోను స్వతంత్రించగలడు. వీటి అన్నింటియెడల ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించగలడు. అందు వల్ల తనను తాను సంస్కరించుకోకపోతే, సంస్కరించుకొని,

తనను దివ్యత్వంలో నిలబెట్టుకోకపోతే మానవుడు జంతుస్థితి కన్నా హీనస్థితికి పడిపోగలడు. ఈ అంశాలన్నింటినీ గమనించే పొట్టపోసుకోవడంతో సరిపెట్టుకునేస్థితిలో మానవుడు ఉండటం మంచిదికాదని పెద్దలు చెప్పారు. తనను తాను సంస్కరించుకునే ప్రయత్నం చేయనినాడు, ఆ పొట్టపోసుకోవడానికి మానవుడు ఎలాంటి వక్రమార్గాలనైనా అవలంబించగలిగిన స్థితికి వెళ్ళిపోతాడు. కనుక ఓ మనిషి ! పొట్టపోసుకుంటేచాలు, అనబోకు అలా అన్నావో నీవు ఆ క్షణంలోనే పడిపోతావు. కనుక నేను మనిషిగా బ్రతకాలి. మనిషిగా రూపొందాలి'– అనికోరుకో. సంకల్పించుకో. ఆ దివ్యస్థితిని సాధించుకో. అని మన పెద్దలు ఉద్బోధించారు. ఆ దివ్యస్థితిని మనం సాధించుకోవడానికి ఒక మహత్తర అవకాశంగానే సనాతన ధర్మమంతా దర్శింపబడి, మన కందించబడింది. కనుక ఆ ధర్మం, ఆ యోగం ఇవన్నీ మనకెందుకు ? అనుకోకండి. మనకోసమే, మనజీవితాన్ని అర్థవంతం చేసుకోవడం కోసమే ఆ సనాతనధర్మం మనకు అందించబడింది. అని గ్రహించండి. అలా అని గ్రహించిననాడే ఈ జీవచ్ఛవస్థితినుండి మానవుడు బయటపడగలుగుతాడు.

దైవంతో, ధర్మంతో అనుసంధానం కుదుర్చుకొని ఉన్నంత వరకే మనిషి మనిషిగా మనగలిగేది. ఆ విషయంలో అశ్రద్ధ చేసిననాడు ఎంతవరకు దిగజారిపోతాడన్నది—ఇక అది అతనికే అంతుబట్టని విషయం. దైవారాధన, ధర్మాచరణ అన్నవి రూపొందింపబడింది. దైవాన్ని ధర్మాన్ని ఉద్ధరించడానికికాదు. మనని మనం ఉద్ధరించుకోవడానికే మనని మనం నిలబెట్టుకోవడానికే !

## నడవడం మొదలు పెడితే

ఎత్తయిన మేడమీద నుండి అలా నడిరోడ్డు మీదికి దృష్టిని సారించినప్పుడు ఆ రోడ్డంతా జనప్రవాహంతో నిండి ఉన్నట్లు కనబడుతుంది. ఎంతగా కనబడుతుందీ అంటే, మనం దిగి వెళితే, అసలు ఈ రోడ్డు మీదికి ప్రవేశించగలమా? ప్రవేశించినా ముందుకు సాగగలమా? అని భయం వేస్తుంది. కాని ధైర్యం చేసి క్రిందకు దిగి, రోడ్డుమీద అడుగుపెట్టి నడవడం మొదలు పెడితే, అంత జనంలోనూ, మన నడక మనకు సాగుతుంది. మనదారి మనకు ఉందని తెలుస్తుంది. అట్లాగే జీవితంలో కూడా ఒక్కొక్కప్పుడు ముందు నుయ్యి, వెనక గొయ్యి అనిపిస్తూ ఉంటుంది. ఎంత ప్రయత్నించినా, ఇక ముందుకు సాగడం అసంభవమనిపిస్తుంది. ఇక ఈ సమస్యలకు పరిష్కారాలే లేవు అనిపిస్తుంది. కానీ, మనని మనం కూడదీసుకుని, ముందుకు అడుగువేయగలిగితే, తరువాతి అడుగువేయడానికి దారి అదే దొరుకుతుంది. కనుక ఎలాంటి సమయంలో కూడా మనం డీలా పడిపోకూడదు. నిట్టూర్పులు విడుస్తూ, నీరసపడిపోకూడదు. ప్రయత్నమనేది మననుండి జరుగుతూనే ఉండాలి. ప్రయత్నం మన నుండి జరుగుతున్నంత కాలం, ఆ తరువాత ఏమి చేయాలన్నది మనకు ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉంటుంది. కనుక మనిషినుండి నిరంతరం ప్రయత్నం సాగుతూనే ఉండాలి. సమస్త సమస్యలను పరిష్కరించ గలిగింది మన నుండి ఆగకుండా సాగుతున్న ప్రయత్నమే.

## అది కూడా చేతగాక

"తనదైన సంస్కృతిని విడిచిపెట్టి, పాశ్చాత్యులను అనుకరిస్తూ చెడిపోతున్నాడు భారతీయుడు." అని అంటూ ఉంటారు చాలామంది. కాని భారతీయుడికి ఆ అనుకరణ కూడ చేతకాలేదు, అన్నది నా అభిప్రాయం. ఆంగ్లేయులనుండి భారతీయుడు అనుకరణగా తెచ్చుకున్నవాటిలో ఎక్కువభాగం అతనికి పనికి రానివే. అతనికి సరిపడనివే !

వేషధారణతో అనుకరించాలన్న ప్రయత్నంలో పడి, వేసవికాలంలో సూటు బూటు వేసుకుని, టై కట్టుకుంటున్నాననుకుంటూ ఉరి పెట్టుకుంటున్నాడు. ఇంగ్లీషువాడి వేషధారణ అది. అది వాడి వాతావరణానికి తగింది. మన వాతావరణంలో వాడిలా మనం వేషం వేసుకుంటే గాలి ఆడక చచ్చిపోమూ!

ఇలాంటిదే ఇంకొకటి. చెంచాలతో, శూలాలతో పొడుచుకుని ఆహారాన్ని తినేప్రయత్నం చేయడం. ఆ ఇంగ్లీషువాడు తీసుకునే ఆహారానికి అవి సరిపోతాయి. సహకరిస్తాయి. వాటిని తీసుకొచ్చి, మన ఆహారానికితగిలిస్తే నోట్లోకి వెళ్ళదు. కడుపునిండదు. ఇలాంటి ప్రమాదకరమైనవి కావాలని పూనుకొని అనుకరిస్తున్నాము కదా! ఇంగ్లీషువాడు సమయపాలన అంటే పడి చస్తాడు. టైమ్ అంటే టైమ్ వాడికి. అందులోవాడినేమయినా అనుకరించ గలిగామా? కనీసం అనుకరించే ప్రయత్నం కూడా మనంప్రయత్నం చేయలేదు. ఎందుకని? అలాంటివి అనుకరిస్తే బాగుపడిపోతాం కదూ! అందుకని. అలాగే ఇంగ్లీషు వాళ్ళకి

వాళ్ళజాతికి సంబంధించిన సంస్కృతీ సంప్రదాయాలంటే ప్రాణం. అనాదిగా వస్తున్నది అలాగే వస్తూనే ఉండాలన్నది వారి అభిప్రాయం. కొన్ని వందలఏళ్ళక్రితం ఒక పదాన్ని ఎలా వ్రాసేవారో, ఇవాళా ఆ పదాన్ని అలాగే వ్రాస్తున్నారు వాళ్ళు. పలకడంలో తేడావచ్చింది కదా! అని ఉచ్చారణలో పలుకబడని అక్షరాన్ని ఈ పదం నుండి తొలగిద్దాము అంటే నీకాహక్కులేదు. అంటున్నారు వాళ్ళు. పదంలో అక్షరం దగ్గర నుండి, రాజరిక వ్యవస్థ వరకూ, ఇవాల్టిదాకా అలాగే నిలబెట్టు న్నారు వాళ్ళు. నిజానికిప్పుడు వాళ్ళకి రాజరిక వ్యవస్థ ఎందుకు? అఖ్ఖరలేదు. అయినా గౌరవప్రాయంగానైనా అనాదిగా వస్తున్న ఆ సాంప్రదాయాన్ని అలాగే ఉంచుకోవాలి అన్నది వారి కోరిక. ఈ విషయంలో, ఈ సంస్కృతీ సంప్రదాయాలను గౌరవించు కునే విషయంలో వాళ్ళను మనం అనుకరించగలిగితే ఎంత బాగుండేది. వాళ్ళు వాళ్ళ సంస్కృతికి ఎంతటి విలువనిచ్చు కుంటున్నారో, మనం మన సంస్కృతికి అంతటి విలువనిచ్చు కునే ప్రయత్నం చేస్తే, ఈ నాడు సాంస్కృతికంగా మనం ఇంత బీదవాళ్ళము అయ్యేవాళ్ళమా? అందుకే అనుకరణ కూడా చేత కాలేదు అన్నాను నేను. పనికి రానివీ ప్రాణం తీసేవి అనుక రించగలిగాము తప్ప, పనికొచ్చేవీ, ప్రాణం పోసేవి అనుకరించ లేకపోయాం. అందువల్ల అనుకరించడం వల్ల చెడిపోయారనడం కన్నా, అనుకరించడం కూడా చేతకాక పోవడం వల్ల చెడిపోయా రని చెప్పడం ఇంకా ఎక్కువ బాగుంటుందేమో!

# వదలండి - ఇకనైన

మనకు స్వాతంత్ర్యం వచ్చి ఎన్నాళ్ళయింది? ఎన్ని దశాబ్దాలు దాటింది. కాని, నాదృష్టిలో ఇంకా మన దేశంలో ఎక్కువమంది బానిసలుగా బ్రతకటానికే ఇష్టపడుతున్నారు. బానిసత్వాన్ని కోరి మరీ వరిస్తున్నారు. పల్లెటూళ్ళలో కూరగాయల తోటలు వేసినవాడు నజరైనవన్నీ పైకి పంపించి, తనకీ, తన ఊళ్ళో వాళ్ళకి మాత్రం పుచ్చులూ, చచ్చులూ మిగుల్చుతున్నాడు. ఏం? వాడు పండించినవేగా? మంచివి కొన్ని అట్టిపెట్టుకుని వాడు తిని, ఊళ్ళోవాళ్ళకు అమ్మవచ్చుగా! వాడికందుకు ప్రాణమొప్పడం లేదు. మంచివన్నీ పైకి వెళ్ళిపోవాలి. పూలతోటవాడూ అంతే! పెద్ద పూలన్నీ పైకి పంపించి, గుడ్డి పూలన్నీ తనకీ, తన ఊళ్ళో వాళ్ళకి అట్టి పెడుతున్నాడు. పళ్ళతోటవాడూ అంతే. నిజమైన పళ్ళన్నీ పైకి పంపించి, ఉట్టుట్టి పళ్ళన్నీ తన ఊరికి మిగులుస్తాడు. జీడిమామిడి తోటల వాళ్ళున్నారు. చక్కటి జీడిపప్పు, కొనలు దేలి ఉన్నది, ఈ దేశంలో కొనుక్కుందామన్నా దొరక్కుండా చేసి, విదేశాలకు పంపించివేస్తున్నారు. ఇలా కాయలు, పూలు, పళ్ళతో మొదలుపెట్టి, పనికి వచ్చే ప్రతి దానిని పైకి పంపించడం మనకలవాటైపోయింది. పండించడానికే మన కధికారమున్నది? అనుభవించే యోగ్యత మాత్రం మనకు ఉన్నట్లు అనిపించడం లేదు. ఆ యోగ్యతను మనంగా వదులుకుంటున్న ఘనత మనది. కూలివాళ్ళుగా మిగిలిపోవడంలోనే మనవాళ్ళకు ఆనందం ఉన్నట్లుగా ఉన్నది. చివరికి ఇవ్వాళ పనికొచ్చే బుర్రల్ని కూడా ఇక్కడి

నుండి ఇతర దేశాలకు రవాణా చేస్తున్నాం. మన విద్యాలయాల్లో, మన డబ్బుతో చదివించి, మేలైన మేధావులుగా వారిని రూపొందించి, ఇతర దేశాల వాళ్ళకి అప్పనంగా అప్పచెప్పుతున్నాం. రెడీమేడ్‌గా కారుచౌకగా దొరికిన మేధావుల్ని ఆ ఆ దేశాలవాళ్ళు అద్భుతంగా ఉపయోగించుకుంటున్నారు. నజరైన కూరలు, నజరైనపళ్ళు, నజరైన పూలు, నజరైన జీడిపప్పు, నజరైన మనుషులు అన్నింటిని రూపొందించి, అలా పైకి పంపించి, ఇలా మిగిలిపోగలగడం అనేది మన ప్రత్యేకత. చెప్పండి బానిసత్వాన్ని మనం వదులుకున్నామా? సిగ్గులేక, బాగున్న ప్రతిదానిమీద ఎక్స్‌పోర్టు క్వాలిటీ అని ముద్రలు కొట్టుకుంటున్నాం. వీటిననుభవించే అర్హతమాకులేదు. వీటిని తయారుచేసే కూలిపనికి మాత్రమే మేం తగిన వాళ్ళం అని ఆ ముద్రలద్వారా ప్రపంచానికి చాటిచెప్పుకుంటున్నాం. ఈ వెట్టి స్థితిలోనుండి తన నిజస్థితిలోనికి ఎప్పటికి వస్తుంది మనజాతి? నిజమైన స్వాతంత్ర్యాన్ని ఎప్పటికి అనుభవించగలుగుతుంది? తనకు తాను ఎప్పటికి ఉపయోగపడగలుగుతుంది! నవభారత పౌరులుగా రూపుదిద్దుకుంటున్న యువకులారా! మీరైనా ఈ ప్రశ్నలకు బదులు పలుకుతారా? మీరైనా ఈ జాతిలో మళ్ళీ ఆత్మవిశ్వాసాన్ని రగిల్చించి, ఈ జాతి ఆత్మగౌరవాన్ని నిలబెట్టగలుగుతారా?

# కంకణ ధారులు కండి

ఇవాళ మనదేశంలో దాదాపుగా ప్రతియువకుడు తానొక ప్రభుత్వ ఉద్యోగిని కావాలనుకుంటున్నాడు. చదువును పూర్తి చేశాననిపించి, ప్రభుత్వోద్యోగంకోసం ప్రయత్నిస్తూ, కాలాన్ని గడిపేస్తున్నాడు. ఏదైనా ఒక ప్రైవేటుకంపెనీలో తప్పనిసరై చేరినా ఎక్కడో అక్కడ ప్రభుత్వోద్యోగమన్నది దొరికితే వెళ్ళి పోదామనే చూస్తున్నాడు. ఆడపిల్లల తల్లిదండ్రులుకూడా ప్రభుత్వోద్యోగులకోసమే వెతుకుతున్నారు. అసలు ప్రభుత్వోద్యోగానికి ఇంతగ్లామరు కలిపించినవాడు ఇంగ్లీషువాడు. భారతీయుల్ని వృత్తివిద్యలలోనుండి బెదరగొట్టే ప్రయత్నాల్లో ఒక భాగంగావాడు ఆ పనిచేశాడు. వృత్తివిద్యలలో ప్రవీణులైననాడు భారతీయులు ఒకళ్ళకొకళ్ళుపరస్పర పరిపోషకంగాపనిచేస్తూ, సుఖసంతోషాలతో ఉంటారు. అటువంటిపకడ్బందీస్థితినుండి జాతిని చెదరగొట్టాలని వాడికి గాఢంగా అనిపించింది. ఈజాతి జాతిగా ఉండకూడదు. ఆ రూపం దానికి మిగలకూడదు. అలా జరగాలీ అంటే, అవిచ్ఛిన్నంగా సాగివస్తున్న సనాతనమైన సంస్కృతి నుండి, ఒకరికి ఒకరుగా నిలబెడుతున్న ఈ జీవనవిధానంనుండి వీరిని మనం వేరుచేయగలగాలీ, అని వాడు నిర్ణయించుకున్నాడు. ప్రభుత్వోద్యోగాలు అనేటటువంటి ఎరలను వేశాడు. వాటిలో విలువను, హోదాను చూపించాడు. ప్రజలకు వాటిమీద మోజుకలిగేటట్లుచేశాడు. దానితో ప్రజలు ముందు వెనుకలుచూసుకోకుండా వాటివెనుక పడ్డారు. వాడి ప్రయత్నం చాలవరకు ఫలించింది. జాతిజీవన విధానం క్రమంగా విచ్ఛిన్నమైంది.

ఇంగ్లీషువాడు వెళ్ళిపోయాడు. ప్రభుత్వోద్యోగాలపైవాడు కలిగించిన మోజుమాత్రం మనలో ఇంకా అలాగే ఉండిపోయింది. ఇంగ్లీషువాడి హయాంలో ప్రభుత్వోద్యోగులు చచ్చినంతపని చేసే వారు. మన హయాం వచ్చాక ప్రభుత్వోద్యోగంలో ఉన్నవారు చచ్చినా పనిచేయనిస్థితి ఏర్పడుతోంది. ఎక్కువమంది ప్రభుత్వోద్యోగులు పనిచేయకుండా, పెత్తనంచేయడానికి అలవాటు పడుతున్నారు. లంచం పుచ్చుకొని మాత్రమే పనిచేయడానికి అలవాటు పడుతున్నారు. ఇంగ్లీషువాడిదగ్గర ఒక లక్షణంఉంది. వాడు మరో ఇంగ్లీషువాడి దగ్గర లంచంపుచ్చుకోడు. మరి ఏ ఇతర జాతివాడికీ లంచం పుచ్చుకోకుండా పనిచేసిపెట్టడు. భారతీయుడి దగ్గర ఒక ప్రత్యేకత ఉన్నది. వాడు మరొక భారతీయుడి దగ్గర మాత్రమే లంచం పుచ్చుకోగలడు. మరి యే ఇతర జాతి వాడిని అడిగే ధైర్యంచేయలేడు. పనిచేయకుండా ఉండేటందుకూ, పెత్తనాన్ని చేసేటందుకూ, డబ్బులు దండుకునేటందుకూ ప్రభుత్వ ఉద్యోగం ఒక అవకాశంగా కనపడుతోంది కనుక, ఇంగ్లీషువాడు రగిలించిన ఆమోజు ఇంకా మనలో అలాగే పెరుగుతోంది.

ఒక గ్రామముంది. ఆ గ్రామంలో పదివేలమంది ప్రజలున్నారు. ప్రభుత్వానికి సంబంధించిన కార్యాలయాలు ఆ గ్రామంలో ఎన్ని ఉంటాయి? ఆ కార్యాలయాలల్లో ఎంతమంది ఉద్యోగులుంటారు? ఆ గ్రామంలో పెరిగివస్తున్న యువతరానికి, ఆ గ్రామంలో ఉన్న కార్యాలయాలలోగల ఉద్యోగాలకీ నిష్పత్తి కట్టిచూడండి. ఎంతమందికి ఉద్యోగాలు వస్తాయి? దేశం మొత్తంమీదైనా దాదాపుగా అదే నిష్పత్తి

నిలబడుతుందిగదా! అలాంటప్పుడు చదువుకున్న ప్రతివాడూ ప్రభుత్వోద్యోగమంటూ చేతులెత్తి, కాళ్ళుజాపికూర్చుంటే ఎక్కడి నుండి వస్తాయి ?

మనిషి బ్రతకాలీ అంటే ప్రభుత్వోద్యోగమే చేయాలా ? ఇవాళ మన వాళ్ళ పరిస్థితిచూస్తుంటే అలాగే అనిపిస్తుంది.

విదేశాలలో ఎక్కడా ఇలాంటి స్థితిగతులులేవు. జీవనవ్యవహారానికి కావలసిన కనీసపు చదువుమాత్రం అందరూ చదువుకుంటారు. ఆ పైన ఎవడికి చాతనైనపనివాడుచేసుకుని బ్రతుకుతాడు. ఇక చదివినా ఆ పనికి అంటే తాను చేస్తున్నపనికి సంబంధించే చదువుకుంటాడు. ఊరికే మనవాళ్ళలాగ బి. ఎ. లూ ఎం. ఎ. లూ అంటూ ఈ మామూలు చదువులు ఎక్కువమంది చదువుకోరు. ఈ జబ్బు మనదేశంలోనే ఉంది. మనవాళ్ళుకూడా టెన్త్‌క్లాసు వరకు అందరూచదువుకొని, తరువాత ఎవడికివాడు తాను ఏ పనిచేయగలడో, దానికి తగిన శిక్షణపొంది, సమాజానికి ఆ పనిని చేసిపెట్టి, హాయిగా బ్రతకడం నేర్చుకోవాలి.

ప్రభుత్వోద్యోగాన్ని ఒక ఉపాధిగా చూసేబుద్ధిమనలో నుండి, పోవాలి. ప్రభుత్వం మనపని అవసరమై మనల్ని పిలిస్తే అప్పుడు మనం వెళ్ళేటట్లుఉండాలి. అలా మనని మనం మలచుకోవాలి. అందుకు ఆత్మవిశ్వాసం కావాలి.

ప్రతిపనిని గౌరవించే మంచి బుద్ధిఅలవడాలి. ఏ పనిని మనం చేయగలమో, ఆ పనిని చేయడానికి హోదాలూ, పరువు ప్రతిష్ఠలూ అడ్డుపడకూడదు. మనం చేయగలిగినపనిని, మనం

చేస్తున్నపనిని గౌరవించడం మనంనేర్చుకోవాలి. అప్పుడు మిగిలినవాళ్ళుకూడా మనలను గౌరవిస్తారు. మరొకరు ఉద్యోగమిస్తేనే మనకు బ్రతుకు అనే స్థితినుండి మన యువకులు బయటపడాలి. పరాయి పాలన మనకు వదలివెళ్ళిన శిధిలస్థితినుండి, మనకు తగిన నవభారతాన్ని మనం రూపొందించుకోవాలి. యువకులారా ! అందుకు కంకణధారులుకండి.

## భవిష్యత్తు - గ్రహాలు

మన జీవితాన్ని, భవిష్యత్తును గ్రహాలు నిర్ణయిస్తున్నాయా ? అన్న అంశాన్ని గురించి మనం ఆలోచించవలసి ఉంది. మనలో చాలమంది మన భవిష్యత్తుముందుగానే నిర్ణయింపబడ్డదీ అని విశ్వసిస్తూఉంటాము. జరగాల్సిందేదో ముందే నిర్ణయమైపోయిందికాబట్టి, ఇంక మనం చేయగలిగిందేమీలేదు అంటాం. ఆ జరుగనున్న భవిష్యత్తు నుదిటిపైన వ్రాయబడిందనో, చేతులలో గీయబడిందనో, జాతకచక్రాలద్వారా చెప్పబడుతూ ఉన్నదనో నమ్ముతూఉంటాం.

సత్యమేమిటంటే మనిషి భవిష్యత్తు మనిషి చేతులలోనే ఉన్నది. అతనిచేతలలోనే ఉంది. ఇంకెక్కడా ఎవరివశంలోనూ లేదు. చేతుల్లో ఉన్నదీ అంటే, చేయబోయే పనులలో ఉన్నదీ అని. చేతల్లోఉన్నదీ అంటే ఇప్పటికి చేసుకున్న పనులలో

ఉన్నదీ అనికూడా. మనిషి ఇప్పటివరకూ చేసుకున్న పనుల ఫలితాలను అనుభవంలోనికి తీసుకొచ్చే శక్తిని విధిఅంటారు. విధి వశమున అని మనం వాడే మాటకు అర్థంఅది. విధి అంటే దైవం కాదు. విధి వేరు. దైవంవేరు. దైవం యొక్క ఒకానొక కక్ష్య 'విధి'. ఇకపైన మనంచేయబోయే పనులతో కావాలీఅనుకుంటే మనం ఈ విధినికూడా మలచుకోవచ్చు. మరలుచ్చకోవచ్చు. కనుక భవిష్యత్తు అనేది మనిషిచేతుల్లోనే ఉన్నది.

అయితే మనిషి జీవితంలో గ్రహాల పాత్ర ఏమిటి ? మనిషి పుట్టినప్పుడు ఉన్నటువంటి గ్రహస్థితులు అంతవరకూ అతడు రూపొందించుకున్న విధియొక్క స్వరూపాన్ని తెలియ జెబుతాయి. ఇకపైన అతని భవిష్యత్తు ఎలా నడవడానికి అవ కాశమున్నదో సూచన మాత్రంగా తెలియజేస్తాయి. అయితే భవిష్యత్తును అలాగే నడుపుకోవాలా ? వేరు విధంగా మలుచు కోవాలా ? అన్న నిర్ణయాధికారం మాత్రం మానవుడిదే !

పరిణామ క్రమంలో మనిషి స్థితినిబట్టి గ్రహాలుమూడు విధాలుగా పనిచేస్తాయి. తొలిదశలో శాసిస్తాయి. మలిదశలో సహకరిస్తాయి. ఆపైదశలో ఒదిగి ఉంటాయి. ఒక ఉదాహరణ చెబితే ఈ సూక్ష్మం మీకుబాగా బోధపడుతుంది. ఒక పెద్దఇంట్లో ఒక పిల్లవాడు పుట్టాడు. ఆ పిల్లవాడు కొంచెంనడక నేర్చుకుని వీధిలోకిపోయే ప్రయత్నం చేస్తుంటాడు. అప్పుడా ఇంటిలో పని పాటలుచేసే మనిషి ఏం చేస్తాడు ? ఆ పిల్లవాణ్ణి వీధిలోనికి వెళ్ళ నీయకుండా, ఇంట్లోకి తీసుకొచ్చి కూర్చోపెడతాడు. పిల్లవాడు మళ్ళీవెళ్ళబోతాడు. పనివాడు మళ్ళీ తీసుకొచ్చి కూర్చోపెడ

తాడు. పిల్లవాడు మళ్ళీవెళ్ళబోతాడు. మళ్ళీతీసుకొచ్చి, ఆ పిల్లవాణ్ణిఅక్కడ కూర్చోబెట్టి, ఈసారి వీధిలోనికి వెళ్ళావంటేకొడతాను. ఇక్కడి నుంచి కదలకు. అని శాసిస్తాడు. ఆ పిల్లవాడుకూడా అందుకు కట్టుబడతాడు.

కొంతకాలం జరిగింది. పిల్లవాడు పెరిగి పెద్దయ్యాడు. అతణ్ణి బడిలోవేశారు. ఇప్పుడా పనిమనిషి పిల్లవాణ్ణి బడికి తీసుకు వెళతాడు. పుస్తకాల సంచీ, క్యారేజీ తానే పట్టుకుని, పిల్లవాడి వెంట నడుస్తాడు. మళ్ళీ స్కూలునుంచి వచ్చేటప్పుడు పిల్లవాడివెంట తోడుగా వస్తున్నాడు. పిల్లవాడికి కావలసినవి తెచ్చి పెడుతున్నాడు. ఈ దశలో అతనికి సహకరిస్తున్నాడు.

మరింతకాలం జరిగింది. పిల్లవాడు కుర్రవాడై, పెద్దవాడయ్యాడు. విదేశాలకు వెళ్ళి చదువుకొనివచ్చి, స్వదేశంలో పెద్ద ఉద్యోగంలో స్థిరపడ్డాడు. అతను ఇంట్లోకి వస్తుంటే, 'బాబుగారు' అంటూ అదే పనిమనిషి చేతులు కట్టుకుని ఒదిగి నిలబడ్డాడు. అతనికి ఏ పనులుచేసిపెట్టాలన్నా, బాబుగారూ! అలాగేనంటూ ఒదిగొదిగి చేసిపెడుతున్నాడు.

ఇక్కడొక అంశాన్ని గమనించాలి మనం. చిన్నానాడు శాసించినా, ఆ తరువాత సహకరించినా, ఆ పైనఒదిగి ఉన్నా ఆ పనిమనిషి ఆ పిల్లవాణ్ణి ఎప్పుడూ ఒకేలా ప్రేమిస్తున్నాడు. ఎప్పుడూ ఒకేలా అతని శ్రేయస్సుని కోరుకుంటున్నాడు. ఆ ప్రేమతోనే ఒదిగి ఉంటున్నాడు. అతడి ప్రేమలో తేడా లేదు. పిల్లవాని స్థితిగతులనుబట్టి, అతను తన ప్రేమని తగినవిధంగా వ్యక్తంచేస్తూవస్తున్నాడు. దీనిని మనం బోధపరచుకోవాలి.

సరిగ్గా గ్రహాలుకూడా మనయెడల ఇలాగే ప్రవర్తిస్తున్నాయి. దేవుని ప్రతినిధులుగా మన శ్రేయస్సుకోరి అవి ప్రవర్తిస్తున్నాయి. బ్రతుకంటే ఏమిటో మనకు తెలియని స్థితిలో పనిమనిషి పిల్లవాణ్ణి శాసించినట్లుగా గ్రహాలు మనలను శాసిస్తున్నాయి. బ్రతుకంటేఏమిటో తెలుసుకుంటూ, మంచిగా బ్రతికే ప్రయత్నం చేస్తున్నప్పుడు చదువుతున్న పిల్లవానికి పనిమనిషి సహకరించినట్లుగా గ్రహాలుకూడా మనకుచేదోడు, వాదోడుగా ఉంటూ మనకు సహకరిస్తున్నాయి. తన నిజ స్వరూపమేదో తానుదర్శించి, నిత్యజీవితంలో ఆ దివ్యత్వాన్ని వ్యక్తంచేస్తూ సిద్ధపురుషుడై మానవుడు వెలుగొందువేళ, జీవితంలో స్థిరపడ్డ కుర్రవానికి పని మనిషి ఒదిగి ఉన్నట్లుగా, గ్రహాలు మానవుడికి ఒదిగి ప్రవర్తిస్తున్నాయి. ఎదుగుదలలోని స్థితులనుబట్టి మూడువిధాలుగా ప్రవర్తించినా, పనిమనిషి పిల్లవానిని ఎప్పుడూ ప్రేమిస్తూనే ఉన్నట్లుగా, ఎప్పుడూ అతని శ్రేయస్సును కోరుతూనే ఉన్నట్లుగా గ్రహాలు మానవుడిని ఎప్పుడూ ప్రేమిస్తూనే ఉంటాయి. అతడి శ్రేయస్సును ఎప్పుడూ ఆకాంక్షిస్తూనేఉంటాయి. కనుక గ్రహాలు మనతో ఎలా ప్రవర్తిస్తున్నాయి. అన్నది, నిత్యజీవితనిర్వహణలో మనమేస్థితిలో ఉన్నాము అన్నదానినిబట్టి ఉంటుంది. ఈ సత్యాన్ని చక్కగా గమనించిన పెద్దలు' గ్రహాలు మానవుని జీవితవిధానాన్ని సూచిస్తాయితప్ప నిర్ణయించవు.' అని తేల్చి చెప్పారు. అతని జీవితం అలాగేసాగాలా ? లేదా మలుపుతిరగాలా ?అన్నది ఎప్పుడూ అతనిచేతులలోనే ఉన్నది. అనివారు నొక్కి చెప్పారు. అతడి భవిష్యత్తును రూపుదిద్దుకోవలసినశిల్పి అతడే. గ్రహాలు కేవలం సహకారులు మాత్రమే. ఆ గ్రహాల నుండి సహాయ సంపత్తులను ఎంతగా పొందగలము ? అన్నది మన సంస్కార, ప్రయత్నాలమీద ఆధారపడి ఉంటుంది.

# మంచుగడ్డ - మంచి మనిషి

ఒక ఫ్రిజ్ ఉంది. దాన్ని ఉపయోగించి ఐసుముక్కలు తయారుచేశాం. ఆ ముక్కల్ని ఇవతలికి తీసి మంచినీళ్ళగ్లాసుల లోనికి వేస్తూవుండగా, పిల్లకాయ ఒకడు ఆ ముక్కలమీద సిరానువంచాడు. ముక్కలన్నీ సిరారంగులోనికి వచ్చాయి. 'అరెరె' అని ఆ ముక్కలపైన మళ్ళీనీళ్ళు పోసి కడిగాం. ఒడుపుగా కడిగేటప్పటికి ఆ రంగుపోయి, మనకు ఐసుముక్కలు మిగిలాయి. ఆ కడగడంలో కొంతకరిగిపోయి ఉండవచ్చు. అయినా ఐసుముక్కలు ఐసుముక్కలుగా మిగిలాయి. అదీ సంతోషం.

ఈ సారి ఆ పిల్లవాడు ఐసుముక్కలు తయారుచేయడాని కని మనం ఫ్రిజ్‌లో తగిన ఏర్పాట్లుచేసి ఇవతలకురాగానే, ఫ్రిజ్ తలుపుతీసి అందులో ఉన్న ఆ నీళ్ళలోనే సిరాపోశాడు. మనం గమనించుకోలేదు. అలవాటుచొప్పున మనం తీసేటప్పటికి ఐసు ముక్కలన్నీ సిరారంగులో ఉన్నాయి. వాటిని ఈ సారి కడగ డానికి ప్రయత్నించామనుకోండి. ఆ సిరా రంగుపోతుందా ? ఎంత ప్రయత్నించినాపోదు. ఎంత కడిగినా, ఐసుముక్కలు సిరా రంగులోనే ఉంటాయి, అప్పుడిక వాటిని మామూలుస్థితిలో మళ్ళీ చూడాలంటే ఏం చేయాలి ? ఆ మంచుముక్కలను నీరుగాచేసి, ఆనీటిని నీటి ఆవిరిగా రూపొందించి, ఆ నీటి ఆవిరిని ప్రత్యేక మైన శ్రద్ధతో చల్లారిస్తే అప్పుడు మళ్ళీ మామూలు నీళ్ళు వస్తాయి. ఆ నీళ్ళను మళ్ళీ ఫ్రిజ్‌లోపెడితే మామూలు ఐసు ముక్కలు వస్తాయి.

మంచు ముక్కమీద సిరాపోయడానికీ, మంచుముక్క తయారుకాకముందు నీళ్ళల్లో సిరానుపోయడానికీ తేడా ఎంత ఉందో గమనించారా ?

అలాగే, ఒక కుర్రవాడు సహవాసదోషాలవల్ల తాత్కాలికంగా చెడిపోయాడనుకోండి. వాణ్ణితీసుకువచ్చి, మందలించి, మంచి వాతావరణంలో కొన్నాళ్ళు అట్టిపెడితే, మళ్ళీ మామూలు స్థితికి వస్తాడు. ఐసుముక్క మీద సిరాపడినప్పుడు కడిగితే ఆ ముక్క మళ్ళీ మామూలుగా వచ్చినట్లుగా !

అలాకాక, ఆ కుర్రవాడు చెడిపోవడంలో అతడిపూర్వసంస్కారాల ప్రేరణ ప్రధానంగా ఉందనుకోండి. అప్పుడు మనం తీసుకువచ్చి, మందలించి, మంచి వాతావరణంలో అట్టిపెట్టడం వల్ల పెద్ద ఉపయోగముండదు. అతడు మళ్ళీ ఏదో ఒక వంకన పూర్వవాతావరణంలోనికి, పద్ధతులలోనికి వెళ్ళిపోవడానికే ప్రయత్నిస్తాడు. కారణం జీవలక్షణాలలోనే ఆ తేడా ఉంది కనుక ! ఐసుముక్కలు కట్టుకోకముందు ఫ్రిజ్‌లో పెట్టబడిన నీటిలోనే సిరాపోయబడిన స్థితిలాంటిదిది. అప్పుడు ఆ ముక్కను ఎంత కడిగినా, సిరారంగుపోనట్లుగా, ఈ కుర్రవాణ్ణి ఎంత మందలించినా, ఉపయోగముండదు. సిరా రంగులో ఉన్న మంచు ముక్కను నీరుగా కరిగించి, ఆ నీటిని నీటి ఆవిరిచేసి, ఆ ఆవిరిని మళ్ళీనీరుచేసి, ఆ నీటిని మళ్ళీ మంచు గడ్డలుగా కట్టించాం. మరి అట్లాంటి ప్రక్రియ ఏదైనా ఈ కుర్రవాని విషయంలో ఉన్నదా ? ఉన్నది. దానినే యోగసాధన అంటారు. ఆ కుర్రవాడు కోరి శ్రద్ధగా యోగాభ్యాసాన్ని ప్రారంభించి, శ్రద్ధతో ముందుకు సాగినప్పుడు ఒకానొకదశలో ఈ సిరారంగులో

ఉన్న మంచు ముక్కకు మనం జరిపినంతకథా అతనిలో జరుగుతుంది. అతనిలో ఆకూడని అవ లక్షణాలన్నీ కరిగిపోయి, సరిక్రొత్త మనిషిగా అతడు రూపొందగలుగుతాడు. సనాతన ధర్మంలో దీనినే ద్విజత్వం అంటారు.

## కృష్ణుడు - క్రొత్త భక్తుడు

'తత్రైకాగ్రం మానః కృత్వా'- అన్నాడు గీతలో కృష్ణుడు. అంటే ఏమిటి? 'మనస్సు అక్కడ ఏకాగ్రం చేయబడి'? అని. బాగానే ఉంది. ఇందులో అక్కడ అంటే అది ఎక్కడ- 'అక్కడ'- అన్నపదాన్ని నీవు ఎక్కడనుండి ఉచ్ఛరిస్తున్నావో అక్కడ అని అర్థం. ఎక్కడ నుండి ప్రతి జీవి నేనున్నాను. నేను చేస్తున్నాను. నేను వస్తున్నాను. అంటూ 'నేను, నేను' అంటున్నాడో, ఆ నేను ఎక్కడినుండి పలుకబడుతున్నదో 'అక్కడ' అని అర్థం. అక్కడకు మనస్సు చేరుకోవాలి. అప్పుడు మనకు యోగస్థితి అనుభవానికి వస్తుంది.

ఇక్కడొక చిత్రముంది. ఈ చిత్రం ఒక ఉదాహరణ చెబితే మీకు బాగా బోధపడుతుంది. ఒకక్రొత్త భక్తుడు వైష్ణవాలయానికి వెళ్ళాడు. ఒక రెండు మూడు కొబ్బరి కాయలూ అవీ తీసుకుని, ప్రదక్షిణలు పూర్తిచేసి, అలా మెట్లెక్కి లోపలికి వెళుతుంటే శంఖ, చక్ర, గదా ధారియైన మూర్తి కనిపించాడు. మనవాడు తపీమని వెంటనే ఒక కొబ్బరికాయ కొట్టేశాడు. కొట్టి

ఇటు ప్రక్కకు చూశాడు. ఇటు ప్రక్కనా శంఖ, చక్ర గదాధారి యైన మూర్తి కనిపించాడు. మనవాడు రెండో కొబ్బరికాయ కొట్టాడు. కొట్టి గుమ్మం దాటాడు. మరోద్వారాన్ని సమీపించాడు. అక్కడ మళ్ళీ శంఖచక్ర గదాధారియైన మూర్తి ఉన్నాడు. అక్కడా కొబ్బరికాయ కొట్టాడు. కొడుతూ ఇటు ప్రక్కకు చూశాడు. అక్కడా మళ్ళా అలాంటి మూర్తే ఉన్నాడు. కొబ్బరికాయలేమో అయిపోయినాయి. ఏం చేయాలో తోచలేదతనికి. విష్ణుమూర్తి ఇలా ఇన్నిచోట్ల కనబడతాడని అతడనుకోలేదు. ఇంతలో ఆ గర్భగుడిలోనుండి పూజారిగారు పిలుస్తున్నారు. భక్తుడు కళ్ళు పెద్దవి చేసుకుని చూశాడు. నిజమైన విష్ణుమూర్తి అక్కడ ఉన్నాడు. ఆయనే నిజమైన విష్ణుమూర్తి అనడానికి ఆ పూజారిగారే సాక్ష్యం. మరి ఇంతవరకూ, ఈ అనిపించిన విష్ణుమూర్తులు? వారందరూ 'ద్వారపాలకులు' అని తెలియ జెప్పారు పూజారిగారు. ఇక్కడున్న చిత్రమేమిటంటే విష్ణుమూర్తి ద్వార పాలకులు కూడా అచ్చం విష్ణుమూర్తిలాగే ఉంటారు. ఆ మేకప్పు, ఆగెటప్పు అంతా అలాగే ఉంటుంది. అలా అయ్యగారిని మరిపిస్తారన్నమాట వాళ్ళు. సరే. పూజారిగారు భక్తుణ్ణి సేదదేర్చి, అతనికి తీర్థప్రసాదాలిచ్చి సాగనంపారు.

అలాగే మనలో ఉన్న నేనుని పట్టుకోవాలి కదా మనం. ఆ పట్టుకోవడానికి చాలా ఒడుపు కావాలి. ఆ ఒడుపే గనుక లేకపోతే మనం కూడా వైష్ణవాలయానికి వెళ్ళిన ఆ భక్తుడిలాగా అయిపోతాం. ఎందుకనంటే మనలో ఎక్కడి కక్కడే ఈ 'నేను' నేనున్నానంటుంది. మనస్సులోని ప్రతి పొరా 'నేను, నేను'

అంటుంది. ఇందులోని ఏ నేను పైనా మన 'నేను' అనుకో వచ్చు. అప్పుడు ఆ భక్తుడి కొబ్బరికాయలాగ మన జన్మ అక్కడికే అయిపోతుంది. అలా కాకూడదు. నేను నిజంగా 'నేను' ను చేరుకోవాలి. 'నేను నేనైన నేనును కావాలి.' అని గట్టిగా మనం సంకల్పించుకున్నప్పుడు, జీవితాన్ని ఆ దైవానికి సమర్పణ చేసుకోవడానికి సిద్ధమైనప్పుడు, దైవమే సద్గురుని రూపంలో సాక్షాత్కరించి, కేలందుకొని కడదాకా తీసుకుని వెళ తాడు. నేను నేనైన నేనుగా మనను నిలుపుకుంటాడు. కనుక ఈ దేహం అనే ఈ వైష్ణవాలయంలో ద్వారాలను దాటుతున్న వేళ ఒడుపును చూపగలవారు కండి. లేకపోతే మనస్సుపొరలో ఎక్కడో అక్కడ అదే మన నిజ స్వరూపమనుకుని, అక్కడే అతుక్కొని ఈ ఆయుర్దాయాన్ని వెచ్చబెట్టేయగలం సుమా! ఆలయంలోనికి చూడకుండానే ఈ దేహానికీయబడిన ఆయువు పూర్తయిపోగలదు సుమా! సద్గురుని రూపంలో దైవం చేయూత నందివ్వగా ఆలయంలోని మూలవిరాట్టును చేరుకున్న జన్మే జన్మ కదా!

## గోదారివలో నీళ్ళబిందె

గోదావరిలాంటి ఒకనది ఉందనుకోండి. ఆ నది ఒడ్డున ఉంటున్న మనం మంచినీళ్ళు త్రాగడానికి ఆ నదిలోని నీటిని ఒక బిందెతో ముంచి ఇవతలికి తెచ్చాం. మరునాటికి ఆ బిందె లోని నీళ్ళ రుచి మారుతుంది. అవి నిలువ నీళ్ళని మనకు

తెలిసిపోతుంది. ఇలా కాదని గోదావరిలోనే ఆ బిందెను అట్టిపెట్టామనుకోండి, బిందె నిండా నీళ్ళున్నాయి. బిందె గోదావరిలో ఉంది. ఇప్పుడా నీళ్ళకు రుచి మారడం ఉండదు. నిలవ వాసన రావడం ఉండదు. పాచితనమనేది ఆ నీళ్ళను సమీపించదు. చూశారా! బిందెతో గోదావరిలోనుండి నీళ్ళను ఇవతలకు తెచ్చుకోవడానికి, ఆ బిందెను గోదావరిలోనే అట్టిపెట్టడానికి ఎంత తేడా వస్తున్నదో!

అలాగే అనన్యచింతన నుండి ఇవతలకు వచ్చిన మనం గోదావరి నుండి ఇవతలకు తేబడిన బిందె నీళ్ళ వంటి వాళ్ళం. అప్పుడా నీళ్ళకు ఏమైందో మనకూ అదే అవుతుంది. నీళ్ళకు నది లక్షణాలు పోయి, బిందె లక్షణాలు అంటినట్లుగా, మనకు అంతర్యామి లక్షణాలు పోయి దేహలక్షణాలు అంటుతాయి. ఇకనేముంది. కోరికలు, కాంక్షలు, ఆవేశాలు, ఆశలు, భయము, అనుమానాలు, ఈర్ష్యాసూయలు, రాగద్వేషాలు - ఇలాంటి పాచితనమంతా జీవితాన్ని అలముకుంటుంది. 'ఇందుకేనా ఈ జీవితం' అని మధ్య మధ్యలో మనకు ఏడుపొస్తుంది. అయినా 'ఇందుకేగా జీవితం' అని అదే పనిగా ఆ అవలక్షణాలతో విజృంభిస్తుంటాం. దానితో అసంతృప్తి, అశాంతి, ఆవేదన, ఈ పాచితనంనుండి బయటపడటం ఎలా గని అన్వేషణ. దానికి మార్గం ఒక్కటే. బిందెను గోదావరి లోనే ఉంచినట్లుగా, మన మనస్సును అనన్య చింతనతో ఆ అంతర్యామిలో నిలుపగలుగుట. గోదావరిలోనే ఉన్న బిందె నీళ్ళకు గోదావరి లక్షణాలే వర్తిస్తున్నాయి తప్ప, బిందె లక్షణాలు పర్తించడం లేదు. అలాగే మన మనస్సు అనన్య

చింతనలో కుదురుకొని, అంతర్యామి అనుభవంలో హాయిననుభవిస్తున్నప్పుడు మన జీవితానికి అంతర్యామి లక్షణాలేవర్తిస్తాయి. మన జన్మకర్మలు దివ్యమైనవిగా రూపొందుతాయి. ఈ మన మానవ జీవితం దేవుని సంకల్పానికి ఒక రూపకల్పనగా వ్యక్తమౌతూ, ఆ అంతర్యామి వైభవాన్ని ప్రకటిస్తూ ఉంటుంది. దివ్యమైన ఈ స్థితిలో ఉన్నవారినే జీవన్ముక్తులు అని మన పెద్దవారు పిలిచారు. జీవించి ఉండగా ముక్తి లభిస్తేనే, మనకీ మనతో ఉన్నవారికీ కూడా హాయి లభిస్తుంది. కనుక అనన్య చింతన అభ్యాసం చేద్దాం. గోదావరిలో నీళ్ళబిందెను గుర్తుంచుకుందాం.

## అడవిదారి - అనన్యచింతన

మా బంధువు ఒక పెద్దాయనఉండేవాడు. స్వాతంత్ర్యం రాకముందు ఆరోజుల్లో తహసీల్దారుగా పనిచేస్తుంటేవాడు. ఒకరోజున క్యాంపుమీద ఒక గ్రామానికి వెళ్ళాడు. వసూళ్ళు పూర్తయ్యేటప్పటికి సాయంకాలమైంది. గ్రామ పెద్దలు ఆయన దగ్గరకు వచ్చి, "బాబూ! చీకటిపడబోతున్నది. దారేమో అడవి దారి. మధ్యలో దారులుకొట్టే దొంగలు ఉంటారు. మీరీ రాత్రికి ఇక్కడే పడుకుని, ప్రొద్దున్నే బయలుదేరి వెళితే బాగుంటుందనిపిస్తోంది." అని అన్నారు. అందుకు ఈ పెద్దాయన : ఏం పరవాలేదు. నాతో ఉన్న ఈ నౌకర్లూ,

నేనూ ఇప్పుడే బయలు దేరుతాం, రాత్రి ప్రయాణం సాగితే, పొద్దున్నే చేయవలసిన పనిని పూర్తిగా చేయడానికి వీలవు తుంది.'' అంటూ ముందుకు సాగాడు. గ్రామ పెద్దలు వారిని పొలిమేర దాకా సాగనంపారు.

అడవి దారిలో సాగుతోంది ప్రయాణం. దూర దూరంగా దారిదొంగలు, తమ పనికి తాము సిద్ధమవు తున్నట్లుగా ఈ తాసిల్దారు గమనించాడు. నౌకర్లను ఇలా ఆజ్ఞాపించాడు : ''చూడండి! దారిదొంగలు మన కొరకు సిద్ధమవుతున్నారు. మీరు ఏమీ భయపడవలసిన పనిలేదు. అటూ, ఇటూ చూడకుండా, నా వెనుక నన్ను చూస్తూ నడక సాగించండి. మిగిలిన కథను నేను చూసుకుంటాను.'' వాళ్ళు 'సరే' నన్నారు.

దారి కటుపైపు, ఇటుపైపు బలమైన కర్రలను పైకెత్తి పట్టుకుని, బారులు తీర్చి నిలబడి ఉన్నారు దొంగలు, ఇక కొట్ట డమే తరువాయి అన్నట్లుగా. అనన్య చింతనలో పండిపోయిన తాసీల్దారుగారు ఆ దొంగల హృదయాలలో, కొలువు తీర్చి ఉన్న దైవాన్ని దర్శనం చేస్తూ, ముందుకు సాగుతున్నాడు. ఆయన వెనుక ఆ నౌకర్లు సరిగా అయన చెప్పినట్లే నడు స్తున్నారు.

దొంగల రూపాలలో చలనం లేదు. వారి చేతులలోని కర్రలు కదలనే లేదు. చెక్కి ప్రతిష్ఠచేయబడిన విగ్రహాల్లా నిలబడి ఉన్నారు వాళ్ళు. తాసీల్దారుగారు అనన్య చింతనలో అఖండమైన దర్శనాన్ని పొందుతూ పరివార సమేతంగా సాగు తున్నాడు. దొంగలు వెనక బడిపోయారు. అలాగే నిలబడి

పోయారు చాలసేపు. ఎప్పటికో వారిలో కదలిక వచ్చింది. ఏమి జరిగిందో ఎందుకు జరిగిందో వారి మనస్సులకు అంతుపట్ట లేదు. కారణం అప్పుడప్పుడే వారి మనస్సులు జాగ్రదవస్థలోనికి వస్తున్నాయి కనుక. అప్పుడే జాగ్రదవస్థలో వస్తున్న వాటికి అంతకు ముందు ఏం జరిగిందీ ఎలా తెలుస్తుంది?

నౌకర్లు ఈ లోకంలోనికి వచ్చారు. ఇంతసేపూ ఏదో ఒక తెలియని దివ్యశక్తి ఒకటి వారినలా నడిపించినట్లుగా వారికి అనిపించింది. గొంతులు సవరించుకుంటూ 'బాబుగారూ! ఏమిటీ సన్నివేశం? ఇంతకూ మీరేం చేశారిప్పుడు? ఇంత అవలీలగా మనం బయటపడ గలగడం అంతులేని ఆశ్చర్యాన్ని కలిగి స్తున్నది,' అన్నారు వాళ్ళు.

ఆత్మీయంగా వారివైపు చూస్తూ తాసీల్దారుగారు ఇలా అన్నాడు: నేను చేసింది వేరే ఏమీ లేదు. పెద్దలు మనకు అనాదిగా అలవాటుచేస్తూ వస్తున్నదే అమలుపరిచాను. వాళ్ళు దొంగలై నిలబడ్డారు. నేను వాళ్ళ హృదయాలలోని దైవాన్ని సాక్షాత్కరించుకునే ప్రయత్నాన్ని చేశాను. నా కన్నులకు పొడ గడుతూనే ఆ దైవం వారి మనస్సులను తనలోనికి స్వీక రించాడు. అంతే! వాళ్ళలా నిలబడిపోయారు. మనమిలా వచ్చేశాం. మనం చూస్తున్న ఈ వైవిధ్యమంతా ఈ మనస్సు పనిచేస్తున్నంత వరకే, హృదయస్థుడైన దైవం అంతటా ఒక్కడై ఉన్నాడు. ఈ వైవిధ్యాన్ని చూస్తున్నప్పుడు మనకి లోకాన్ని గురించి ఒకప్పుడు మంచిగా అనిపిస్తుంది. మరొకప్పుడు భయం ముంచుకొస్తుంది. ఇలా రకరకాలుగా అనిపిస్తుంది.

ఆ అనిపించడాన్ని బట్టి మన మనస్సు రకరకాల స్థితులను అనుభవిస్తుంది. అలాకాక సర్వజీవుల హృదయస్థుడైన సర్వాంతర్యామిని, అనన్య చింతన ద్వారా అనుభవించడమన్నది మనకు అలవాటైతే ఈ వైవిధ్యం అప్పుడు మనలను ఇబ్బంది పెట్టదు. ఆ సర్వాంతర్యామి యొక్క లీలగా అది మనకు గోచరిస్తుంది. మనకు ముచ్చటను కలిగిస్తుంది, అలాటి ముచ్చటలలో ఒక ముచ్చటనే మన మిప్పుడు అనుభవించాం.

ఇదీ తాసీల్దారుగారి కథ. అనన్య చింతనలో పట్టుచిక్కినప్పుడు మానవ జీవితం ముచ్చటగా ఎలా నడిచిపోతుందో ఈ గాథ మనకు తెలియ చెప్తుంది.

## మన చొక్కా – ఈ జగత్తు

ఈ జగత్తు ఇలా కనబడుతున్నది. నిజానికి ఈ జగత్తుగా కనబడుతున్నది బ్రహ్మమే. మీకొక చిన్న ఉదాహరణ చెబుతాను చూడండి. ఇప్పుడు మనంవేసుకుంటున్న ఈ చొక్కా ఉన్నది. దీనిని మనం చొక్కా అంటున్నాం. నిజానికి అదిచొక్కా కాదు గుడ్డ. ఆ గుడ్డను ఒక ఆకారంలోనికి మలచి చొక్కా అంటున్నాం. ఏమంటారు ? ఇది చొక్కాకాదు గుడ్డ అని తేలింది కదా !

నిజానికి ఇది గుడ్డ కూడాకాదు. గుడ్డనిలా లాగిచూడండి. ఇక్కడున్నవి దారపుపోగులు. దారపుపోగుల్ని ఒడుపుగా

ఒకలాచేర్చి గుడ్డ అంటున్నాం. బాగుంది. ఇక్కడ ఉన్నవి దారపు పోగులు అన్నంతవరకు వచ్చాం.

నిజానికి ఇక్కడ ఉన్నవి దారపుపోగులుకూడకావు దారపు పోగులుగా సాగదీయబడిన ప్రత్తి ఇక్కడ ఉన్నది.

నిజం చెప్పాలీ అంటే ఇక్కడ ఉన్నది ప్రత్తికూడకాదు. ప్రత్తిరూపాన్ని పొందుతున్న అణువులు పరమాణువులు. పరమాణువుల రూపంలో వ్యక్తమవుతున్న ఒకానొకచైతన్యం. దానినే తెలిసినవారు 'బ్రహ్మము' అన్నారు.

చిత్రం చూశారా ! మహా చైతన్యం, పరమాణువులుగా అణువులుగా, ప్రత్తిగా, దారపు పోగులుగా, గుడ్డగా సాగివచ్చి, చొక్కా రూపాన్ని ధరించి, మనకు వినియోగపడుతూ వున్నది. కాని ఇదేమిటి అన్నప్పుడు మనమేమంటున్నాం? ఇది నాచొక్కా అంటున్నాం. చిత్రమదే. చొక్కా కనబడుతోందితప్ప గుడ్డ కనబడటంలేదు. గుడ్డలోపలి దారపుపోగులూ కనబడటంలేదు. ఆ లోపల ప్రత్తీ కనబడటంలేదు. ఇంకా ఆలోపలికథ అసలే కన బడటంలేదు. ఇలా కనబడక పోవటాన్నే పెద్దలు 'మాయ' అన్నారు.

మనకు వినియోగపడుతున్న రూపంమనకు కనబడుతోంది తప్ప, అక్కడ ఉన్న అసలుస్థితి మనకు కనబడటంలేదు. విని యోగపడుతున్నరూపం జగత్తు అనబడుతుంది. అక్కడ ఉన్న అసలుస్థితి బ్రహ్మము అనబడుతుంది.వినియోగపడుతున్నరూపం యొక్క అసలు స్థితిని గమనించగలిగినప్పుడే మనమారూపాన్ని సద్వినియోగపరచడమన్నది సాధ్యపడుతుంది.

అసలుస్థితిని మరచి, రూపాన్ని మాత్రమే చూచినప్పుడు ఆ రూపాన్ని మనం తోచినట్లు వాడుకుంటాంతప్ప, ఎలా వాడుకోవాలో అలా వాడుకోలేం. ఎందుకు వాడుకోవాలో అందుకు వాడుకోలేం. దానియెడల ఎలా ప్రవర్తించాలో అలా ప్రవర్తించలేం. దానిని సద్వినియోగపరచడం ఎలాగో తెలుసుకోలేం. కనుక అక్కడ ఉన్న అసలు స్థితిని గమనిస్తూ, ఆ అసలు స్థితినుండి వ్యక్తమవుతున్న రూపాన్ని సద్వినియోగంచేయడంలో ఒడుపును చూపించమని పెద్దల ఉపదేశం. బ్రహ్మమును గమనించగలిగిన వాడే జగత్తును సార్థకముగా వినియోగించగలడని వారి అనుభవ పూర్వక సందేశం.

## కార్యప్రయాణం - కావలసిన సందేశం

ఎవరైనా ఒక పెద్దాయన ఏదైనా ఒక మంత్రం ఉపదేశించి, 'నాయనా ! దీనినిచేసుకో. నీ జీవితం దారినపడుతుంది ! అని చెబితే ఆ మంత్రాన్ని తీసుకున్నాయన అడుగుతాడుగదా ! 'ఏమండీ ! మీరిచ్చిన ఈ మంత్రాన్ని ఎన్నిరోజులు చేయాలి ? అని. ఏదైనా ఒక సాధనమార్గాన్ని ఉపదేశించినా ఇలాగే అడుగుతూ ఉంటారు. 'ఎన్నాళ్ళుచేయాలండీ ఈ సాధనను ? అని. మరి ఇలాంటి ప్రశ్నలు భోజనం చేయటంలో ఎందుకురావు ? ఎన్నాళ్ళుచేయాలండీ ఈ భోజనాన్ని అని అడగరేం ? నిద్రవిషయంలో ఎందుకురావు ? ఎన్నాళ్ళుపోవాలండీ ఈ నిద్రను అని అడగరేం ? ఒక్క ఆధ్యాత్మిక సాధనదగ్గరకు వచ్చేసరికే ఇలా అడుగుతారెందుకని ? సాధనయొక్క స్వరూపం

బోధపడినవాడు ఇలా ఎన్నడూ అడగడు. సాధనఅంటే ఎందుకో, ఏమిటో తెలియని వారే ఇలాంటి ప్రశ్నలు వేస్తుంటారు.

సాధన అనేది నిరంతరం సాగవలసినదే, ఈ దేహం ఉన్నంతవరకూ ఈ జీవితం సాగుతున్నంతవరకూ సాధనకూడా సాగుతుండాలి. తెలియనివారు కొందరు అనుకుంటారుగదా ! సాధనలో పట్టుచిక్కేంతవరకూ సాధనచేస్తే సరిపోతుందని. అలా చేస్తే ఇక అంతటితోసరి. అది తప్పకుండా పోతుంది. ఒకడు చిన్నకారు నడపడం నేర్చుకుంటున్నాడు. నడపడంచాతకాంగానే మానేస్తాడా ? నడపడంవచ్చేంతవరకూ ఆ రావడం కోసం నేర్చుకుంటున్నాడు. నడపడం వచ్చిన తరువాత తన కార్య నిర్వాహణ కోసం ఆ కారు నడుపుకుంటున్నాడు. మొత్తంమీద ఎప్పుడూ కారును నడుపుతూనే ఉన్నాడు.

చిన్నకారులో దూరపు ప్రయాణం చేస్తున్నవాడు ఇప్పటికి దాదాపు అరవై మైళ్ళుగా నాచేతులు ఈ స్టీరింగును పట్టుకునే ఉన్నాయి. ఇంతసేపటినుండి పట్టుకునే ఉన్నాను కాబట్టి, ఇప్పుడు ఒక్క అయిదు నిముషాలపాటు ఈ చేతులు తీసేస్తేమాత్రం ఏమవుతుంది ? అనుకున్నాడనుకోండి. ఏమవుతుంది ? ఏమవుతుందో చెప్పటానికి అతను మిగిలితేగా ? ఆధ్యాత్మిక సాధన విషయంలోకూడా అంతే. 'ఇన్నాళ్ళుగా చేస్తున్నాముగదా ! కొద్దికాలం విరమిద్దాం.' అని అనుకోవడానికి అవకాశంలేదు. కారునడుపుతున్నంతవరకు స్టీరింగుపైన చేయి ఉండవలసినదే. జీవితం సాగుతున్నంతవరకు మనలో సాధన కూడా జరుగుతూ ఉండవలసిందే. ఇందులో ఏ మరపాటుకు అవకాశంలేదు.

అయితే సాధన సాగుతూ ఉన్నకొద్దీ మరింత అనుభూతి జీవితరూపంలో వ్యక్తమవుతూ ఉంటుంది. కారునడపడం చేత నయినకొద్దీ ప్రయాణం మరింత సుఖకరంగా సాగినట్లుగా.

కారు డ్రైవింగ్ నేర్చుకుంటున్న తొలినాళ్ళలో చాల ఇబ్బందిగా ఉంటుంది. ఎటువైపుకు తిప్పాలన్నా ప్రత్యేకమైన ప్రయత్నం అవసరమై ఉంటుంది. రోడ్డుపైన వచ్చేపోయే వాహనాల్లు 'మాకు దారి ఇవ్వండి.' అని హారనుకొడుతుంటే, "ఇవన్నీ మనమీద కత్తికట్టినట్లున్నాయేమిటి ? నేను రోడ్డుమీద ప్రయాణం చేయడం వీరికి ఇష్టం లేదా ?" అనిపిస్తుంది. వారికి బదులు చెప్పడమూ కష్టంగానే ఉంటుంది. అలాగే సాధన ప్రారంభమైన తొలినాళ్ళలో ప్రతిసన్నివేశం మనని పరీక్షిస్తున్నట్లుగానే ఉంటుంది. బంధుమిత్రులరూపంలో ఉన్న రకరకాల వ్యక్తు లందరూ మనకు అడుగడుగునా అడ్డొస్తూ, మనను పడగొట్టే ప్రయత్నం చేస్తున్నట్లుగా ఉంటుంది. అసలు మనను పడగొట్టందే వీళ్ళు నిద్రపోరా ? అనిపిస్తుంది. నిజానికి వాళ్ళు ఈ రోడ్డుమీద వచ్చేపోయే వాహనాలలాంటివారు. వాళ్ళ వాళ్ళ ప్రవత్తులను బట్టి వారు పోతున్నారు. వారిని తప్పుకుంటూ సాగడం మనకే చేతకావాలి. కారు నడపడం చేతనయినకొద్దీ, రోడ్డుపైన ఎలాంటి వాహనాలు వస్తూపోతూ ఉన్నా, అలవోకగా ఎలా తప్పించుకుని పోతూ ఉంటామో, అలాగేసాధనలో పట్టు చిక్కిన కొద్దీ, తారసపడుతున్న బంధుమిత్రాదులను అలాగే అలవోకగా తప్పుకొని పోగలుగుతాం.

డ్రైవింగ్ నేర్చుకుంటున్న రోజుల్లో అంటే కారు నడపడం వచ్చిన కొత్తల్లో మనతోపాటు నలుగురినీ ఎక్కించుకొని, చిన్నపాటి దూరప్రయాణం పెట్టుకున్నామనుకోండి. డ్రైవింగ్‌లో

ఉన్న కొత్తదనానికి కారు కదిలిపోతూ ఉంటుంది. బంధు మిత్రులు ఎగిరిపడుతూ ఉంటారు. తీరా ఊరు చేరేటప్పటికి బంధువుల ఇంటికి వెళ్ళాలో, హాస్పిటల్‌కి వెళ్ళాలో తెలియక వాళ్ళు తికమకపడతారు. అదే కారు డ్రైవింగ్ వచ్చిన తరువాత, అందులో బాగా ఒడుపు కుదిరిన తర్వాత బంధుమిత్రాదులతో కలసి ప్రయాణం పెట్టుకున్నామనుకోండి. కారును చక్కగా నడుపుతూనే మనతో ఉన్న బంధుమిత్రులకు మంచి మంచికబుర్లు చెప్పవచ్చు. భగవద్గీతలోని శ్లోకాలనూ వివరించవచ్చు. అలాగే, ఆధ్యాత్మిక సాధన ప్రారంభించిన తొలి నాళ్ళలో కొంతకాలంపాటు మనం ఇబ్బంది పడుతూ, మనతో ఉన్నవాళ్ళను కూడ ఇబ్బందులకు గురిచేస్తూ ఉంటాం. "వీడితో మనకెందుకు వచ్చిందిరా బాబు?" అని వాళ్ళందరూ విల విల లాడిపోయేటట్లుగా, అదేసాధన పాకాన పడుతున్నకొద్దీ మనం హాయిగా ఉంటూ, మనతో ఉంటున్నవారికికూడా హాయిని అందించ గలుగుతాం.

డ్రైవింగ్‌ని ఒక కళగా అభ్యసించినవాడు రద్దీ రోడ్లపైన చిన్నకారును వేగంగా నడుపుతూ త్యాగరాజ కృతులను పాడుతున్నాడు. రామదాసు కీర్తనలను ఆలపిస్తున్నాడు. భగవద్గీతలోని సూక్ష్మాంశాలను గూర్చి తనతో ప్రయాణం చేస్తున్న వారితో ముచ్చటిస్తున్నాడు. ముచ్చటిస్తూనే అలవోకగా కారును లెక్కలేనన్ని మలుపులు తిప్పేస్తున్నాడు. అలాగ సాధనలో నైపుణ్యం అబ్బిన కొద్దీ మనస్సును జీవితకార్యం వెంట అలవోకగా నడుపుతూ, మనం సర్వాంతర్యామిత్వంలో అనుభూతిప్రదంగా విహరిస్తూ ఉండవచ్చు. ఒకవంక కారును చక్కగా నడుపుతూనే మరొకవంక భగవద్గీతను ముచ్చటిస్తున్నాడు

గదా ! తాను పులకిస్తూ, తోటివారిని పులకింప చేస్తున్నాడు కదా! ప్రయాణం చేస్తున్నందుకుగాను, బడలికను అతడేమీ పొందడం లేదుకదా! సరిగా ఆ దృశ్యాన్నే స్మరించండి. మరల మరల స్మరించండి. జీవన ప్రయాణంలో మనం మాత్రం ఎందుకు బడలికను పొందాలి? మనం మాత్రం ఎందుకు అలిసిపోవాలి? ప్రయాణం చేయడం చేతనయితే మనకు బడలిక ఉండదు. మనకు అలసట ఉండదు. ఆ చేతకావడానికే యోగసాధన, ఆ చేతనవ్వడమే యోగస్థితి. మనస్సూ ఇంద్రియాలను కర్తవ్యం వెంట నడిపిస్తూ మనం అనన్య చింతనతో అంతర్యామి అనుభవంలో హాయిననుభవిస్తూ ఉండే దివ్యస్థితి మనకు అలవడాలి. ఒక త్యాగరాజ కృతులు, ఒక రామదాసు కీర్తనలు, ఒక భగవద్గీతలోని శ్లోకాలు ఆ కారు నడిపే అతడికి అలసట తెలియనిహాయిలో ఎలా ఉంచగలుగుతున్నాయో, అనన్య చింతనతో అంతర్యామి అనుభవంలో కుదురుకుంటున్న కొద్దీ మనస్సు, ఇంద్రియాలద్వారా మనం నిర్వహిస్తున్న జీవిత ప్రయాణం ఇక మనకు అలసట అనిపించదు. ఇక మనకు అలసటను కలిగించదు. అలాంటి జీవిత ప్రయాణం మనకు అలవడిన నాడు ఈ మన జన్మ కర్మలు పవిత్రమై పరమార్థాన్ని సాధించగలుగుతాయి. ప్రయోజనకరమై పదిమందికీ శ్రేయస్సును ఒనగూరుస్తాయి. సత్కర్మాచరణ రూపంలో దైవతత్వాన్ని భూమిపైన ఆవిష్కరిస్తాయి. ఆనందానుభూతి రూపంలో అమృతత్వాన్ని భూమి మీదకు అవతరింపజేస్తాయి. అప్పుడు మన జీవితమే ఒక అమృతావరణమౌతుంది. మన జీవన సరళి ఆ ప్రణవనాద విలాసమౌతుంది.

— ০ —

మానవజాతిని కర్తవ్యోన్ముఖం చేస్తున్న మన సారధి

# శ్రీ కృష్ణస్వామి రచనలు

1) స్వామిగేయాలు
2) దర్శనాలు-నిదర్శనాలు-మొదటిభాగము
3) దర్శనాలు-నిదర్శనాలు-రెండవభాగము
4) సందేహాలు-సమాధానాలు
5) సంభాషణలు-సమన్వయాలు
6) అన్వేషణ-అనుభూతి
7) అక్షరాల్లో అనుభూతులు-మొదటిభాగము
8) అక్షరాల్లో అనుభూతులు-రెండవభాగము
9) అక్షరాల్లో అనుభూతులు-మూడవభాగము
10) అక్షరాల్లో అనుభూతులు-నాలుగవభాగము
11) మానవసేవలో మాష్టర్ ఇ. కె.
12) మాటలు-మంత్రాలు-మొదటిభాగము
13) మాటలు-మంత్రాలు-రెండవభాగము
14) కులపతి కృష్ణమాచార్య
15) భారతం-ధర్మాద్వైతం
16) వాక్కులు-చుక్కలు
17) స్వామిలేఖలు-శాంతిరేఖలు
18) సరసాల్లో నవరసాలు-మొదటిభాగము
19) సరసాల్లో నవరసాలు-రెండవభాగము
20) సరసాల్లో నవరసాలు-మూడవభాగము

21) స్వామి పలుకులు-స్వాతి చినుకులు-మొదటిభాగము
22) స్వామి పలుకులు-స్వాతి చినుకులు-రెండవభాగము
23) మాటల మధ్యలో రాలిన ముత్యాలు-మొదటిభాగము
24) మాటల మధ్యలో రాలిన ముత్యాలు-రెండవభాగము
25) నిత్యసత్యాలు-ఆణిముత్యాలు-మొదటిభాగము
26) నిత్యసత్యాలు-ఆణిముత్యాలు-రెండవభాగము
27) పునర్నిర్మాణానికి శంఖారావం
28) కామధేనువు కనికరించినవేళ
29) ఇదీ మన సంస్కృతి-ఇదీ మన సంప్రదాయం
30) పూజావిధానము-రుద్రాభిషేకము
31) శ్రీమద్రామాయణము-మానవ ధర్మము
32) శ్రీమద్భాగవతము-దివ్యజీవన మార్గము
33) నిత్యజీవితానికి నియమావళి-హోమియోపా పుస్తకము
34) ప్రథమ చికిత్స-తరుణ వ్యాధులు-హోమియోపా పుస్తకము

---

ప్రతులకు :

మానవ ధర్మ శిక్షణ సంస్థ
23-10-7, పురుషోత్తం వీధి, సత్యనారాయణపురం,
విజయవాడ-520 011.